JAGATI    Rs. 2-00    June 1992

37th Year of Publication




4 3 1

జూన్ - 1992

# సాహితీ సుధ

ఇంచుక ముద్దు లేనగవు లింపగు నన్య విలాససూక్తు ల
భ్యంచిత లోలదృష్టియు నవారుణ పల్లవ మండలంబు ని
ర్మించు సలీల యానములు మేలుగ యౌవన లక్ష్మి తోడ వ
ర్తించు మృగాక్షి చందము లతి ప్రమదంబు ఘటింప జాలవే

—భర్తృహరి



మృగనాభి నికరంపు బుగబుగల్ కలచోట - జదలేటి తుంపురుల్ చెదరు చోట
వకుళవాటీ గంధవహుండు పైకొను చోట - గుర్వ్వార తరు ధూళి గప్పు చోట

బనమిాఱు సెలయేఱు లిసుక వెట్టిన చోట - జిగురు మావుల సంజ నిగుడు చోట
నవమాలికల తీవె నట్లుట్టి వడు చోట - మాణిక్య దీపముల్ మలయు చోట

భ్రమమున దేటు లెలుగెత్తి పాడు చోట - శారికా లంగ శాస్త్రముల్ చదువు చోట
గీరికల కంఠముల్ క్రొవ్వి కేరు చోట - బావురము లారజంబులు పలుకు చోట

— వనవర్ణన - అల్లసాని పెద్దన 'మనుచరిత్ర'





'జ గ తి' - 2, కచేరీ రోడ్, మైలాపూర్, పి బి 2922, మద్రాసు - 600 004
ఫోన్ : 76697 - చందా 2 సం॥లకు రు. 50-00 - 4 సం॥లకు రు. 100-00- జీవిత
చందా రు. 300-00. పాట్రన్ - రు. 1000-00. విదేశాలలో పాట్రన్ రు. 2000-00

ముఖచిత్రం : రాజీవ్ గాంధీ

# నిమ్మతొనలు

అటజని గాంచె భూమిసురు డంబర చుంబిత.... ఏమి చూశాడురా, గోపీ ? - అని ప్రశ్నించాడు టీచరు.

ఇటూ అటూ బిత్తరపోయి చూస్తూ, తన సీటులో నిలబడి 'నాకు తెలిదు, సార్' - అన్నాడు గోపీ.

'శీతశైలము చూశాడు - అంటే హిమవత్పర్వతాన్ని. ఈ పద్యం 'మనుచరిత్ర' లోనిది. 'మనుచరిత్ర' వ్రాసిన దెవరు ?' - అని ఈసారి సోమూని అడిగాడు టీచరు.

'నాకు తెలీదు, సార్' అన్నాడు సోమూ.

'ప్రసాద్ ?'

'తెలీదు, సార్'

తనకు తెలుసునన్నట్లు నిలబడ్డాడు రఘు.

చెప్పమన్నాడు టీచర్.

'పెద్దయ్య'

టీచరు చిరునవ్వుతో అన్నాడు : 'మీ పెద్దయ్య, మా పెద్దయ్య కాదు - అల్లసాని పెద్దనామాత్యుడు.'

—యమ్ సోమశేఖర్
అమలాపురం

రాజేష్, ఈ సుజాత నన్నింత దగా చేస్తుందనీ, అన్యాయం చేస్తుందనీ అనుకోలేదు - అని వాపోయాడు శేఖర్.

'ఏం బ్రదర్ ఏం చేసింది - సుజాత నీతో బాలా 'ఛమ్మీ'గా ఉండేది కదా !' - ప్రశ్నించాడు రాజేష్.

'నన్ను యిరుకున పెడుతోంది - నేను ఆమెని తెనియక ప్రేమించాను.'

'నీవు కాదని మరొకరిని ప్రేమిస్తోందా ?'

'అదేం కాదు, పెళ్లి చేసుకోమంటోంది.'

'సహజం కద !'

'నేను ప్రేమించాను గాని పెళ్లి చేసుకుందామనుకోలేదు. తనని పెళ్లి చేసుకోకపోతే, నేను వ్రాసిన ఉత్తరాలన్నీ 'నారీ నికేతన్' వారికి వొప్పగిస్తుందట. అంత పనీ చేస్తే, నా ఉద్యోగం ఊడుతుంది.'

'సినిమాలలోకి మల్లే నీ కాళ్లా వేళ్లా పడుతుందను కున్నావా నాయనా ? ఎడ్యుకేటెడ్ గరల్ అంటే ఏమిటను కున్నావ్ ?' - అని మిత్రుని ఓదార్చాడు రాజేష్.

—యమ్ శ్రీనివాసరావు
ఫిరంగిపురం

రచయిత రాంబాబు కొత్తగా పెళ్లి చేసుకున్నాడు. ఆరు నెలలు తిరక్కుండా భార్యాభర్తలు విడిపోవటం ముకుందానికి ఆశ్చర్యం కలిగి,

'ఏమయ్యా రాంబాబూ, అంత తొందరగా పెళ్లి చేసుకు, అంత తొందరగా విడిపోయారు - ఏమిటి కథ ?' - అని అడిగాడు.

'మా ఆవిడే విడాకులు యిచ్చింది.'

'అదే - ఎందుకిచ్చిందని ? కారణమంటూ ఏదో ఒకటి వుండాలి' - అని ముకుందం ప్రశ్న.

'నేను రచయితని కదా - ప్రతి రచన వెంట హామీ పత్రం పంపడం నా అలవాటు.'

'ఊ'

"'ఈ వివాహానికి పూర్వం పర పురుషుని ఎరగను' - అని హామీ పత్రం రాసివ్వమన్నాను. ఆ సాయింత్రమే పుట్టింటికి వెళ్లిపోయింది. నాలుగు రోజులలో విడాకుల నోటీసు వచ్చింది."

—పియమ్ సుందరరావు
విజయవాడ-8

బంధువులని మద్రాసు ఎక్స్‌ప్రెస్‌లో ఎక్కించడానికి నాంపల్లి స్టేషనుకొచ్చిన శ్యామలరావుని, కుశల ప్రశ్నలయాక, పరాంకుశం 'మీ కాలనీలో నీళ్ల బెడద ఎలా ఉంది ?' అని అడిగాడు.

'సగం తగ్గింది.'

'అదేమిటి, మీ కాలనీ నుంచి నిన్న సెక్రటేరియట్‌కి కొందరు పెద్ద మనుషులు వచ్చి కంప్లయింట్ చేశారు నీళ్ల రావడం లేదని ... సగం తగ్గిందంటావేమిటి ?'

'కంప్లయింటూ నిజమే - సగం బెడద తగ్గడమూ నిజమే !' - అన్నాడు శ్యామలరావు.

'నాకు బోధపడటం లేదు.'

'బోధపరుస్తాను. రోజూ తెల్లవారు జామున మూడు గంటలకి నీళ్లు వచ్చేవి ఇంట్లో - ఎవరికీ నిద్దర్లు వుండేవికాదు. ఈ మధ్య నెల్లాళ్లుగా రోజు విడిచి రోజు వస్తున్నాయి. సగం బెడద తగ్గినట్లేగా !'

—కె వెంకటరామయ్య
పామర్రు


# జి. పుల్లారెడ్డి
## స్వచ్ఛమైన నేతి మిఠాయి

హైదరాబాదు
ఫోను : 230833

కర్నూలు
ఫోను : 20288, 21445

# పాఠకుల తీర్పు

యన్నార్ గారికి నమస్కారములు. 'క్రొత్త పుస్తకాలులో', రాధికా ప్రణయం, గోపికా హృదయం మీద సుమతీ సాగర్ రివ్యూ చూసి చాలా ఆనందించినాను.... మిమ్మల్ని విమర్శించే శక్తి, చనువూ నాకు లేవు. మిమ్మల్నెప్పుడూ నేను చూడలేదు - చూసేది 'డైరీ' ద్వారానే! సంపూర్ణ అవగాహన దొరక్క, రాస్తున్నాను.... ఏదో ఇంద్రలోకంలోని వైభవాలు, సౌందర్యాలు, సంగీత నృత్యాలు, పెద్ద పెద్ద భవనాలు, గొప్ప గొప్ప స్నేహితులు, సైంటిస్టులు, సినీ యాక్టర్లు, కార్లలో తిరగడం, విందుల్లో పాల్గొనడం - యివన్నీ చదువుతూంటే, ఒక్కోసారి కళ్లు గిర్రున తిరుగుతాయి. మీరెందరి హృదయాలలో మెరుపులా మెరుస్తూంటారో అపినిస్తుంది - అదృష్టవంతులు - బిజీ, బిజీ దినచర్య .... ఇంతకీ మీకోసం మీరు ఏం చేసుకుంటున్నారండీ? గుప్పెడు ఆధ్యాత్మిక చింతనా విత్తనాలు చల్లి, వెన్నెల అనే ప్రేమనీటితో తడిపితే గాని పరిపూర్ణత లభించదేమో!

—త్రిపుర
శ్రీరాంనగర్

చందూర్ గారికి : శుభాకాంక్షలతో .... కేసరి గారి 'చిన్ననాటి ముచ్చట్లు' తర్వాత, తల్లాప్రగడ ప్రకాశరాయడి గారి 'నా రాట్నచక్రం' ధారవాహికంగా ప్రచురించటం చాలా బాగుంది. మారుతూన్న సామాజిక పరిస్థితులకు దర్పణం రెండూను. 'డైరీ' లోని విషయాలను, సన్నిహిత స్నేహితులతో చెప్తున్నట్టుగా వ్రాసే శైలి, ఆ ప్రతిభ చాలా అరుదు. ఛార్లెస్ లాంబ్ Personal Essays మీ 'డైరీ' కి దగ్గరగా రావచ్చును. తెలుగులో యిది క్రొత్త ప్రక్రియ అని నా అభిప్రాయం. సాహితీ సుధ, పాతికేళ్లనాటి పిక్చర్, మానవ ప్రగతి వంటి శీర్షికలు బావున్నాయి - **Very useful and Informative.**

—ఎవి కృష్ణారావు
మద్రాసు-36

ఆప్తమిత్రులు చందూర్ గారికి నమస్కారములు. కేంద్ర సాహిత్య అకాడమీ వారు యంగర్ జనరేషన్ రైటర్స్ కథా సంకలం ప్రచురించాలని తలపెట్టారు - యంగర్ అంటే 30-40 మధ్య. పాతికేళ్ల వారిని కూడా చేర్చవచ్చు - కథలు మంచివైతే! ఇప్పుడు రాయలసీమ ప్రాంతంలో బాగా వ్రాస్తున్నారు. కోస్తాలోను, తెలంగాణాలోను తక్కువ. కెఆర్ శ్రీనివాస య్యంగార్ గురించి మీరు 'జగతి' లో చెప్పినది నాకెంతో నచ్చింది.

—డి రామలింగం
హైదరాబాదు-44

# వెన్నెల కెరటాలు

## స్వీయ చరిత్రం

అప్పారావుగారు 1880-90 మధ్య తమ 'కన్యాశుల్కం' నాటక రచనకై వివాహాల వివరాలు సేకరించినట్లు తెలుస్తుంది.... మన తెలుగు వారి తొలి స్వీయ చరిత్రలు 19వ శతాబ్ది తెలుగు పల్లెలు పట్నాలు, ఆచార వ్యవహారాలు, పరిపాలనా వ్యవస్థ, నాటి వృత్తులు, ఉద్యోగాలు, ప్రజల మనోబుద్ధులు మున్నగు జాతి జీవన విధానాలను ప్రతిబింబిస్తాయి. వీరేశలింగం పంతులుగారి (1848-1919) 'స్వీయ చరిత్ర', ఏనుగుల వీరాస్వామిగారి (1760-1836) 'కాశీయాత్ర చరిత్ర', ఆదిభట్ల నారాయణదాసుగారి 'నా యెఱుక', కోవలో - రాంబొట్ల జగన్నాథశాస్త్రి (1850-1916) 'స్వీయ చరిత్రము' వాటి సరసన స్థానమీయ తగ్గది. గురజాడవారి ప్రస్తావన వున్న ఈ స్వీయచరిత్రకు విశాఖపట్నం జిల్లా ఆధార క్షేత్రం.

—మసూనా
'ఎక్స్‌రే' లో

## 'మన్నిమాల' అబ్రహాము

క్లిష్ట పరిస్థితుల్లో మన్నిమాలలోని దళిత నాయకుడైన ఎలాసరి అబ్రహాము ప్రదర్శించిన ప్రజ్ఞ గణనీయమైనది. మన్నిమాల దళితులను చైతన్యవంతులను చేయడంలో కడు విశిష్ట పాత్రను వహించారు. దళితు రందరినీ సమీకరించి, కరువు నెదుర్కోడానికి, పలు పథకాల ద్వారా మన్నిమాల అభివృద్ధిని సాధించడానికి "ది రూరల్ డెవలప్‌మెంట్ లాండ్ అగ్రికల్చరల్ లేబరర్స్ అసోసియేషన్" ఏర్పాటుచేసి దానిని ప్రభుత్వంలో నమోదు చేశారు. తర్వాత దళితులను సంఘటిత పర్చి, ఒక శక్తిగా రూపొందించారు. అబ్రహాం నాయకత్వంలో, ఆ సమాజసభ్యులు, డివిజన్ ఫర్ సోషల్‌యాక్షన్ అధినేత డా॥ రాజరత్నంగారిని కలుకొని, వారికి తమ పరిస్థితిని తెలియజేశారు. డా॥ రాజరత్నంగారు వారి బాధలను కూలంకషంగా అర్థం చేసికొని, తగిన ఆర్థిక వనరుల నేర్పరచి, 71 ఎకరాల పొలం తిరిగి కొని, ఒకొక్కరికి 2 ఎకరాల చొప్పున వారి వారి పేర్లపై నమోదు చేసి, వారికి యాజమాన్య పత్రాలను అందించారు.

—వ్యాసభాగం
'ప్రజా పక్షం'

# పాతికేళ్ల నాటి పిక్చర్

శ్రీదేవి వారి

## 'భువన సుందరి కథ'

ఎగిరే పల్లకీ, పరకాయ ప్రవేశం- ఈ చిత్రంలోని ప్రత్యేకతలు. గ్రీకుల రెక్కల గుర్రాలు, మధ్య ప్రాచ్య కథలలోని మాజిక్ కార్పెట్, గంధర్వుల కామ రూపమూ ఆకాశగమన విద్య - యిటువంటి అద్భుతలోక వింతలు సామాన్య జనావళిని ఎప్పుడూ ఆకర్షిస్తూనే వుంటాయి. ఈ చిత్రంలోని ఎగిరే పల్లకీకి కొన్ని మీటలు వున్నాయి. ఇది హెలికాప్టర్‌కీ, గంధర్వ శిల్పి పనితనానికీ మధ్యస్థంగా వుండి, చంద్ర సేనుని (యన్‌టి రామారావు), భువన సుందరి (కృష్ణకుమారి) మేడమీదకి తెచ్చి, మంచి వాళ్లనీ చెడ్డవాళ్లనీ మందకొడులనీ మూర్ఖులనీ కథాగమనానికి అనుకూలంగా విభజిస్తుంది.... 'పూలమాల – పులినోరు' వంటి లాటరి చీట్లతో న్యాయనిర్ణయం జరిపించే కాంచీ పురాధిపతి హిరణ్యవర్మ (మిక్కిలినేని) కుమార్తె భువన సుందరిని, రాజగురువు (ధూళిపాళ) తనయుడైన దేవదత్తుడు (సత్యనారాయణ) బలాత్కరిస్తూంటే, సమయానికి పెద్దలు వచ్చి అడ్డుపడతారు. అంతఃపుర ద్రోహిని భువనేశ్వరీ పీఠానికి (పూలమాల - పులినోరు) వొప్పజెబుతారు. కుతంత్రుడైన రాజగురువు, దుష్టుడైన దేవదత్తుడు - వీరికి ప్రతిగా విచిత్ర సేనుని (ముక్కామల) కుమారుడు చంద్రసేనుడు - అంటే కథానాయకుడు.... బ్రహ్మరాక్షసి రూపం దాల్చిన అందమైన యక్షకన్య, యితని వల్ల శాపవిమోచన పొంది, పరకాయ విద్య ఉపదేశించటం, రూపు మారిన తిప్పయ్య (గూని) చంద్రసేనుని వంచించి, కొన్ని కడగండ్ల తర్వాత లెంపలు వాయించుకోవటం. ఎగిరే పల్లకి పరకాయ విద్య వుండి కూడా దుర్విధి పాలైన చంద్రసేనుని ఒక ఎలుగుబంటి దరికి చేర్చటం - వింత మలుపులతో కూడిన ఈ చిత్ర గమనానికి అనేక ముళ్లువేసి, నేర్పుగా విప్పారు జివిజి. ఘంటసాల సంగీతమూ, ఆచార్య సంభాషణలూ బావున్నాయి. రాకుమారుని ఠీవిలో రామారావు రాణిస్తే, భువన మోహినిగా, భువన సుందరిగా కృష్ణకుమారి ప్రేక్షక హృదయాన్ని ఆకట్టుకుంటుంది. మిగతా అందరూ తమ పాత్రలకు న్యాయం చేకూర్చారు. దర్శకత్వం : సి పుల్లయ్య. నిర్మాత : తోట సుబ్బారావు.

—యన్నార్ చందూర్ సమీక్ష
'జగతి'-జూన్ 1967

## మానవ ప్రగతి

3

### వినియోగదారు

భారతదేశం వినియోగదారులకు, చట్టపరంగా కొంత రక్షణ కల్పిస్తున్నది. ఉదాహరణకు, ఆహార పదార్థాలు, మందులు, అలంకరణ వస్తువులలో కల్తీ నివారణ, ప్రామాణికత, తూనికలు, కొలత వంటి వాటిలో వినియోగదారుని ఆదుకుంటున్నది. మనదేశంలో ప్రప్రథమంగా 1986 లో సమగ్ర, సమన్వయ దృష్టితో వినియోగదారుల చట్టానికి సంస్థాపరంగా నాంది పలికారు. మోసపోయిన వినియోగదారులు నష్టపరిహారార్థం వ్యాపారస్తుని మీద లేక ఉత్పత్తి దారుని మీద అధికారులకు ఫిర్యాదు చేయవచ్చును. ఈ ఫిర్యాదులను స్వల్పకాలంలోనే ఎలాంటి ఖర్చు లేకుండా పరిష్కరిస్తున్నారు. ఈ చట్టం అమలుకు కేంద్ర, రాష్ట్ర జిల్లా స్థాయిల్లో మూడంచల వ్యవస్థను ఏర్పాటు చేశారు. జిల్లాస్థాయితో వినియోగదారులు, జిల్లా ఫోరంకు ఫిర్యాదు చేసికుని నష్టపరిహారం పొందవచ్చును. జిల్లా ఫోరంకు జిల్లా జడ్జి అధ్యక్షులుగా ఉంటాడు. జిల్లా ఫోరంలో ఫిర్యాదు చేసుకోటానికి వినియోగదారుడు ఎలాంటి స్టాంపు ఫీజును చెల్లించవలసిన అవసరం ఉండదు. కేవలం అతను తన ఫిర్యాదును దరఖాస్తూ రూపేణ జిల్లా ఫోరానికి సమర్పించుకోవాలి. జిల్లా ఫోరం ఇలాంటి ఫిర్యాదులపై తక్షణమే తీర్పులను ఇస్తుంది. జిల్లాస్థాయి ఫోరంలో లక్షరూపాయల లోపు విలువ వస్తువుల ఫిర్యాదులను మటుకే స్వీకరిస్తారు. ఈ చట్టం క్రింద ఫిర్యాదు చేసుకునేందుకు వీలున్న రాష్ట్ర కమీషన్న ఏర్పాటు చేసారు. అలానే జాతీయస్థాయిలో అత్యున్నత స్థాయిలో జాతీయ వినియోగదారులు వివాదాల పరిష్కార సంఘం, ఫిర్యాదుల పునః పరిశీలన, చట్ట పరిధిలో నిర్ణయాలు, పరిశీలన మొదలైన చర్యలు చేబడుతుంది. వినియోగదారుల సమస్య పరిష్కారానికి దేశంలో ఎలాంటి చట్టాలు లేని పరిస్థితులలో ఈ చట్టాన్ని దేశంలో ప్రప్రథమంగా రూపొందించినందువలన వీటిలో అనేక లోటుపాట్లు ఉన్నట్లు గ్రహించారు. ఈ చట్టాలలో లోటుపాట్లును సవరించ

టానికి కేంద్రం ఒక అధ్యయన బృందాన్ని ఏర్పాటు చేసింది. దేశంలో వినియోగదారుల ఉద్యమం నడిపించటంలో స్వచ్ఛంద సంస్థలు ముఖ్యపాత్రను వహించాయి. ఈ సంస్థలు అధికార యంత్రాంగం జోక్యం లేకుండా నడిపించాలని కోరుతున్నాయి. స్వచ్ఛంద సంస్థలు, కేవలం పట్టణాలకే పరిమితం చేయకుండా పల్లె పల్లెలకు తీసుకువెళ్లాలి.

(ప్రెస్ ఇన్‌ఫర్మేషన్ బ్యూరో

## 'డిస్కవరీ'

ఈ ఏడాది (1992) అమెరికా ప్రయోగించదలచిన మొత్తం ఎనిమిది రోదసీ విమానాలలో (స్పేస్ షటిల్స్) మొదటిది ఇటీవల అంతరిక్ష యాత్ర జరిపిన సందర్భంగా అందులో రోదసీలోకి వెళ్లిన అంతర్జాతీయ పరిశోధకులు.... 14 దేశాలకు చెందిన 200 మందికి పైగా శాస్త్రవేత్తలు సమకూర్చిన ప్రయోగాలను అక్కడ నిర్వహించారు. ఈ ప్రయోగాల ద్వారా సముపార్జించిన పరిజ్ఞానం పదార్థాలు, జీవశాస్త్రాలపై నూతన అవగాహన ఏర్పాటుకు దోహదం చేసి భూమిపైన గల వారందరికీ ప్రయోజనం చేకూర్చగలదని అంటున్నారు. ప్రయోగించదలచిన ఎనిమిది రోదసీ విమానాలలో మొదటిదిగా 'స్పేస్ షటిల్ డిస్కవరీ' ఇటీవల అంతరిక్షయాత్ర జరిపినప్పుడు దానితోపాటు.... దాని సరుకుల గది (కార్గోబే)లో ఒదిగి.... 7 కోట్ల డాలర్ల 'స్పేస్ లాబ్' కూడా రోదసీ ప్రవేశం చేసింది. ఈ 'స్పేస్ లాబ్' (అంతరిక్ష పరిశోధనాశాల) అనేది అన్ని పరికరాలు అమర్చిన ఒక 'ప్రెషరైజ్డ్' ప్రయోగశాల. 'డిస్కవరీ' ఎనిమిది రోజుల అనంతరం మళ్లీ భూమికి తిరిగివచ్చింది. మొక్కలు, కీటకాలు, స్ఫటికాలు, వ్యోమగాము పై అల్పగురుత్వాకర్షణ (లోగ్రావిటీ) ప్రభావం ఎలా వుంటుందనే అంశంపై ఈ ఎనిమిది రోజుల కాలంలో షటిల్‌లోని వ్యోమగాములు నిరంతర పరిశోధనలు జరిపారు ఈ ప్రయోగాల నుంచి సేకరించిన సమాచారం భవిష్యత్తులో చంద్రుని మీదికి, అంగారకుని పైకి జరిపే దీర్ఘకాలిక వ్యోమయాత్రలకు ఎంతైనా ఉపయుక్తం కాగలదని భావిస్తున్నారు. 'డిస్కవరీ' వ్యోమగాములలో ఆరుగురు పురుషులు, ఒక మహిళ ఉన్నారు. ఈ యాత్ర సందర్భంగా 'స్పేస్ లాబ్'లో నిర్వహించిన ప్రయోగాలలో కణాలు, మొక్కల పెరుగుదలకు సంబంధించిన మౌలికాంశాల నుంచి.... 'భార రహిత స్థితికి మానవశరీర ప్రతి స్పందన' అనే సంక్లిష్ట అంశం వరకు పరిశోధనలు జరిగాయి. కక్ష్యలో దీర్ఘకాలం గడపడానికి లేదా రోదసీలో సుదీర్ఘ ప్రయాణాలు చేయడానికి ముందు అక్కడ (అంతరిక్షంలో) రేడియేషన్, తగ్గిన గురుత్వాకర్షణ అనేవి ప్రాణుల పై ఎట్టి ప్రభావం చూపుతాయనేది తెలుసుకోవడం ముఖ్యం. చంద్రునిపై ఒక కాలనీ కట్టుకోవడానికి లేదా,

అంగారకునిపైకి యాత్ర ప్రారంభించడానికి ముందు ఈ అంశాలను క్షుణ్ణంగా తెలుసుకోవలసి వుంది. పటిష్టమైన లోహాలు, వ్యాధినిరోధక ఔషధాల అభివృద్ధికి అవసరమైన స్వచ్ఛమైన స్ఫటికాల పెరుగుదలపై ప్రధానంగా దృష్టి కేంద్రీకరించి కొన్ని పదార్ధ సంబంధిత శాస్త్ర విజ్ఞాన ప్రయోగాలను కూడా 'స్పేస్ లాబ్'లో పరిశోధకులు నిర్వహించారు. ఈ పరిశోధనలు మరింత సమర్ధమైన వ్యాధినిరోధక ఔషధాల రూపకల్పనకు దారితీయగలవని భావిస్తున్నారు .. వ్యోమగాములు కొన్ని గోధుమ మొక్కలను కూడా 'స్పేస్ లాబ్'లో పెంచి మొక్కలు పెరిగే 'దిశ' పైన భార రహిత స్థితి ప్రభావం ఎలా వుంటుందనేది కూడా పరిశీలించారు. భార రహిత స్థితిలో కూడా గోధుమ మొక్కలు పెక్కు సెంటిమీటర్ల ఎత్తుకు పెరిగి అన్ని దిశలలోకి వాలుతుండడం పరిశోధకులకు సంభ్రమం కలిగించింది. భార రహిత స్థితిలో వ్యోమగామి శరీరంలో రక్తప్రవాహం ఎలా వుంటుందనే అంశాన్ని 'డిస్కవరీ' యాత్రలో మరొక ప్రయోగం ద్వారా తెలుసుకున్నారు.... అంతరిక్ష యాత్ర సమయంలో వ్యోమగామి శరీరంలో రక్తం, ఇతర ద్రవాలు, ఛాతీ, తల భాగాలకేసి ప్రవహిస్తాయి. దీనివల్ల భూమికి తిరిగొచ్చాక మగతగా అనిపిస్తుంది.

(అమెరికా మాసచారశాఖ

## శాఖాహారం

దక్షిణాఫ్రికాలోని భారతీయుల ఓటు హక్కు, స్వాతంత్ర్యం కోసం ఇతోధిక కృషి సలిపే సమయంలోనే గాంధీజీ అక్కడ 'నటల్' అనే రాష్ట్రంలో ఉంటూ, శాఖాహార ప్రచారానికి పూనుకొన్నారు. అది 1895 సంవత్సర ప్రాంతం. దక్షిణ ఆఫ్రికాలో శాఖాహారిగా ఉండడం ఆ రోజుల్లో చాలా కష్టం. లండన్ నగరంలో కొంచెం సులువే గానీ నటల్‌లో పళ్లు, కూరలు దొరకవు. తొమ్మిది నెలలు ప్రచారం చేశారు. బంగారు గనులపై ఉన్న శ్రద్ధ, ఆసక్తి, వ్యవసాయంపై లేవు. 'వెజిటేరియన్' అనే పత్రిక అన్ని లైబ్రరీలకు వెళ్లేది. వార్తా పత్రికల్లో ఎడ్వర్‌టైజ్‌మెంట్స్ కూడా వేసేవారు. కొన్ని ఉత్తరాలు, పుస్తకాలు రావడం మొదలయింది. కొన్నిట్లో హాస్యము, అపహాస్యము ఉండేవి. ఈ శాఖాహార ప్రచారం ఒక మత ప్రచారంలా ప్రపంచమంతటా సాగాలనీ, శాఖాహార పంటలు పండే అనువైన ప్రదేశాలకి ప్రజలు తరలి వెళ్లాలని, ఈ ఉద్యమ పరిధి మరింత విశాలం కావాలని గాంధీజీ ఆరోజుల్లో కోరుకునేవారు. ఉపయోగకర జంతువులు ఆవులు, ఎద్దులు, గుఱ్ఱాలు శాఖాహారులు. ఉపయోగపడని ప్రమాదకర జంతువులు మాంసం మీద జీవిస్తాయి.

(సర్వోదయా ప్రెస్ సర్వీస్





?

"Kaikeyi was a queen in her own right, born into a royal family and brought up in a regal way. How could she be carried away by the evil tongue of a servant-maid like Mandhara? Knowing fully well that it was the eldest son to succeed the throne, how could she make such a stupid request of asking her son to be crowned?" questioned Raghu.

"Dasaratha granting two boons on a battle-front, the divine curse of a blind couple who lost their son by Dasaratha's misdeed, Mandhara playing the devil at the opportune moment - these and many more such examples are only a background for banishment," said Raghu's father.

"I wonder what prompted Bharata to refuse?"

"Implicit obedience to the elder brother Rama, the incarnation of Lord Vishnu. Take it from me, all the characters are firm on their ground excepting Dasaratha. the vacillating old king This Dasaratha, in his thoughtlessness and carnal desire promised Yudhajit (Father of Aswapati, Bharata's uncle) that he would make Kaikeyi's son the future king of Ayodhya. Only on that clear assurance did Yudhajit give his daughter in marriage to Dasaratha. And after marriage, Dasaratha was so enamoured of his third wife that he became a captive, neglecting his duties. Kaikeyi was never harsh - she claimed the promised right to her progeny but Bharata defied his mother upholding *Dharma*," explained Raghu's father.

---

*Swadharma Swaarajya Sangha (Director : BVSS Mani*
*Beehive Bldgs - 29, Prakasam Road, Madras - 600103.*



# ప్రసంగ పాఠం



కలకత్తా ఆంధ్రా అసోసియేషన్ వారు మాలతీ చందూర్‌ని, సత్కరించాలని అనుకోవడం వల్ల, 1992 మార్చి 29 వ తేదీ సాయంత్రం ఆరుగంటలకు అక్కడికి వెళ్లాము. ఏడుంబావుకి మరొక చోటుకి, అంటే భారతీయ భాషా పరిషత్తుకి, వెళ్లవలసి వుంది. టైము చాలక నేను చెప్పలేక పోయిన ప్రసంగ పాఠమిది :

వేదిక మీదున్న మాన్యులకు, అత్యంతాప్తులు శివస్వామి దంపతులకు, కలకత్తా ఆంధ్రమహాసభ కార్యవర్గ సభ్యులకు, ఈ సమావేశాని కొచ్చిన యావన్మందికి, మాలతీ - చందూర్ల మనఃపూర్వక నమస్కారాలు.

కలకత్తా ఆంధ్రా అసోసియేషన్ అనగానే 'చందమామ' రామారావు గారు జ్ఞాపకం వస్తారు. నలభై ఏభై ఏళ్ల క్రితం ఆయన యిక్కడ, మీ అసోసియేషన్ తెలుగు స్కూలులో టీచరుగా పని చేసి, రామానంద ఛటర్జీ 'మోడరన్ రెవ్యూ'లో - మీలో బహుకొద్ది మంది ఆ పత్రిక పేరు విని వుంటారు- ఆ మోడరన్ రెవ్యూలో తెలుగు పుస్తకాలు సమీక్షిస్తూ, యిక్కడ నుంచి 'ధర్మపత్ని' సినిమా తీసేందుకు పి పుల్లయ్యగారితో కొల్హాపూర్ వెళ్లి, డైలాగులు రాసేందుకు చక్రపాణిని అక్కడికి రప్పించి - చక్రపాణి అసలు పేరు ఎవి సుబ్బారావు ; ఆ పేరుతో రాస్తే ఆకర్షణీయంగా ఉండదని చక్రపాణిగా పెన్‌నేమ్ పెట్టుకున్నానని ఆయనే ఒకసారి చెప్పారు - ఆ చక్రపాణి, ఈ రామారావుగారు, మద్రాసు ఆచారప్పన్ వీధిలోని 'చందమామ' చేరుకున్నారు. ఆ 'చందమామ' ఈ నాడు తెలుగు జాతికే గర్వకారణంగా, పధ్నాలుగు భాషలలో వెలువడుతున్న ఏకైక పత్రిక.... 'చందమామ' రామారావుగారు ఈ మధ్యనే భువిలోని 'చందమామ'ని వొదిలి, దివిలోని చుక్కల్లోకి వెళ్లారు.

నాకు మల్లేనే ఆయనకి కూడా 'ప్రవాస' అనే శబ్దం యిష్టం వుండేది కాదు. మన దేశంలో మనం ప్రవాసుల మేమిటి ? - రాష్ట్రేతరాంధ్రులు అనడం మనవాళ్లు యింకా ఎప్పటికి నేర్చుకుంటారో అనేవారు. 'ప్రవాసి' అనే పేరుతో జమ్‌షెడ్పూర్ నుంచి వెనకొక పత్రిక వచ్చేది - యిప్పుడు వస్తోందో లేదో తెలీదు. కలకత్తాలో గాని, ఢిల్లీలోగాని, బొంబయిలోగాని వున్న ఆంధ్రులు ప్రవాసు లెంత మాత్రం కాదు ; రాష్ట్రేతరాంధ్రులు.

కొన్ని శబ్దాలు భాషలోకి చొరబడి ఒక పక్షాన వదలవు.

కలకత్తా రావాలనీ, ఈ వంగ భూమి దర్శించాలనీ, గురుదేవుని శాంతినికేతన్ విశ్వభారతీలు చూడాలనీ ఎంతో కాలంగా మా స్వప్నం. రెండు నెలల క్రితం, మొన్న జనవరిలో, శివస్వామీ దంపతుల ప్రేమానురాగాలవల్ల, ఆ కోరిక తీరడమేగాక, సుందర్‌బన్స్ వీక్షించగల అపూర్వావకాశం కూడా లభించింది.

బెంగాల్‌కీ ఆంధ్రాకీ మొదటినుంచీ గాఢమైత్రీ లత అల్లుకుపోయింది. సంస్కరణోద్యమం, రాజకీయ సంచలనం, సాహితీ వికాసం యిక్కడ తల ఎత్తి తెలుగు సీమలోకి పాకేవి. దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి 'ఊర్వశి' గురుదేవ్ టాగూర్ ఆశీస్సు పొందింది - స్వయంగా చదివి విశ్వకవికి చదివి వినిపించారటాయన. తెలుగు వారికి శరత్ - శరశ్చంద్రఛటర్జీ లేక ఛటోపాధ్యాయ - తమ రచయిత - బెంగాలీ అనుకోరు. పద్మభూషణ్ అక్కినేని నాగేశ్వరరావుని మహానటునిగా చేసినది శరత్ రచన 'దేవదాసు'. రెండవ ప్రపంచ యుద్ధకాలంలో కలకత్తాలో ఏర్పడిన అతిదారుణమైనకరువు,భవానీ భట్టాచార్య 'So Many Hungers' ద్వారా బయటవారికి తెలిసింది.

'ఇవ్వాళ బెంగాల్ అనుకున్నది – రేపు ఇండియా అనుసరిస్తుంది' అనేది పాత మాట అయినప్పటికీ, అందులో కొంత నిజం. యిప్పటికీ లేకపోలేదు. అధిక జనసంకీర్ణతగల పట్నమైనప్పటికి ఈ మహానగర్ కొన్ని సాంస్కృతిక విలువలని అతి పదిలంగా కాపాడుతోంది. జాతీయ వారసత్వమెప్పుడూ కళల ద్వారా వ్యక్తమవుతుంది - ఆ కళల పరిరక్షణలో రాజకీయ వాసనలు లేవు. సాహిత్యం, సంగీతం, చిత్రలేఖనం, రంగస్థలం - యిలాంటివే అక్కడి ప్రజల కళాభిరుచిని తెలుపుతాయి. 'రవీంద్ర సంగీత్' అందుకొక ఉదాహరణ. కలకత్తా న్యూథియేటర్స్ వారు 150 పిక్చర్లు తీశారట - అందులో ఒక్కటి కూడా సెన్సార్ కట్‌కి లోను కాలేదంటే,క ళాత్మక విలువలపట్ల గల గౌరవమే కదా !

మీలో ఎందరికి బెంగాలీ, చదవడం వ్రాయడం వచ్చునో నాకు తెలీదు. వారి భాష నేర్చుకు, మన భాష నేర్పడం ద్వారానే భాషామైత్రి ఏర్పడుతుంది. వేంకట పార్వతీశ్వర కవులు బెంగాలీ నేర్చుకు, బంకిమ్ చంద్ రచనలు తెలుగులో వ్రాశారు. ఆ విధంగానే వేలూరి శివరామశాస్త్రి గారు 'రాముని బుద్ధిమంతనం', 'తీరని కోరికలు' వంటి శరత్ నవలలు తెలుగులోకి తెచ్చారు. ఒకనాటి 'భారతి' సంపాదకులు గన్నవరపు సుబ్బరామయ్యగారు, 'శివశంకర పిళ్లై' నవలని మళయాళం నుంచి తెలుగు చేశారు. మొన్నీ మధ్య, అంటే పది రోజుల క్రితం, ఈ కలకత్తా నుంచి 'సురజిద్ ఘోష్' అనే సాహితీవేత్త - 'ప్రేమ్' అనే బెంగాలి లిటరరీ క్వార్టర్లీ ఎడిటర్ - మద్రాసు వచ్చారు. కేంద్ర

సాహిత్య అకాడమీ ఆఫీసులో కలుసుకున్నప్పుడు ఆయన అన్నారు : 'మనకు జర్మన్‌లోను, ఫ్రెంచిలోను, ఆఫ్రికా ఖండంలోను వచ్చే పుస్తకాలు తెలుసు - కాని, ఇరుగు పొరుగు భాషలలోని సాహిత్యం తెలియదు ; సాహితీపరుల పేర్లు కూడా వినివుండము' - అన్నారు.

ఇదంతా ఎందుకు చెబుతున్నానంటే, రాష్ట్రేతరాంధ్రులు తాము నివశిస్తున్న ప్రాంతంలోని భాషను నేర్చుకోవడం ద్వారా, ఆ భాషలో తమకు నచ్చినవి, తెలుగువారికి చెప్పడం ద్వారా, తెలుగు భాషని సుసంపన్నం చేయడమే గాక, భాషా సఖ్యత ద్వారా, జాతీయ సమైక్యతకు, దేశ సమగ్రతకు తోడ్పడిన వారవుతారు.... 'దేశాభిమానం నాకు కద్దని - వొట్టి గొప్పలు చెప్పుకోకోయ్ - పూని యేదైనాను వొక మేల్ - గూర్చి జనులకు చూపవోయ్' - ఎనభై తొంభై ఏళ్ల క్రితం ఆ మాటలు ఎవరన్నారో నేను చెప్పక్కర్లేదు - మీకు తెలుసు.... వోపికగా విన్న మీ అందరికీ కృతజ్ఞతాభివందనములతో సెలవు తీసుకుంటున్నాను.

—యన్నార్ చందూర్





జెమిని పళ్ళపొడి

జెమిని కెమికల్ ప్రొడక్ట్స్ (ఫర్మ్) పోస్ట్ బాక్స్ నం. 7,
మచిలీపట్నం-521 001. ఆం.ప్ర. (ఇండియా)

పళ్ళకు తెలుపుదనం — చిగుళ్ళకు గట్టిదనం.

# కొత్త పుస్తకాలు

కుమ్మరి మొల్ల - సినిమా నవల. రచన: డా॥ ఇంటూరి వెంకటేశ్వర రావు. ప్రతులకు: వెంకట మైత్రేయి కళామందిరం, 4, గంగెయమ్మన్ కోయిల్ వీధి, మద్రాసు - 600 024 .... నాలుగవ ముద్రణ.... వెల రు. 30-00.

దేవుణ్ణే వివాహం చేసుకుంటాననే సంకల్పం, ఆ వాంఛ సఫలం కావడం, పెరియాళ్వార్ అభిమాన పుత్రిక ఆండాళ్ కథను స్మరింప జేస్తుంది - అని రాజమన్నార్; ఈ నవలను అధారంగా చేసుకొని శ్రీ సుంకర సత్య నారాయణగారు వ్రాసిన బుర్రకథ ఎన్నో దళాలచేత చెప్పబడి, అశేష ప్రజానీకపు మన్నలందుకున్నది - అని చిత్తూరు నాగయ్య; అనుంగు బిడ్డ 'కుమ్మరి మొల్ల' కృతికన్యను కృతజ్ఞతతో స్వీకరిస్తున్నానని మూడవ ముద్రణ అందుకున్న అక్కినేని నాగేశ్వరరావు - ఇంటూరి వారి సారస్వత కృషిని అభినందించారు. దుక్కిపాటి మధుసూదనరావు, డివియస్ రాజు, చివియస్సెస్ మణి ఈ పుస్తక ప్రచురణలో ఆర్థికంగా సాయపడ్డారు. అర్జునరావు డాక్టరు ఇంటూరి సంక్షిప్త జీవిత చరిత్ర వ్రాశారు.

'మొల్ల'ను వెండితెర కెక్కించడానికి యల్వి ప్రసాద్, డియల్ నారాయణ వెనకాడారు. పద్మనాభం సాహసంతో ముందంజవేసి, వాణిశ్రీ, గుమ్మడి, నాగభూషణం, అల్లు రామలింగయ్య, సత్యనారాయణ మున్నగు వారితో 'కథానాయిక మొల్ల' నిర్మించగా, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వపు 'సువర్ణనంది' అందుకున్నది ఆ చిత్రం. ఇంటూరివారు తమ రచనని సినిమా నవల అన్నారు గనక యిందులో కనిపించే సినిమా లక్షణాలకు మనం ఆశ్చర్యపోనక్కరలేదు.

గోపవరం అగ్రహారంలో శ్రీరామ నవమి రోజున, రంగనాయకి స్వామి వారి ముందు నాట్యం చేస్తూన్నప్పుడు, అఖండ జ్యోతి ఆరిపోగా, కేసన కూతురు గర్భగుడిలో ప్రవేశించి ఆ జ్యోతి వెలిగిస్తుంది; దేవునికి అపచారం జరక్కుండా అడ్డుపడుతుంది. కాని ఊరు పెద్దల ఆగ్రహావేశలవుతారు. శ్రీకంఠమల్లేశుని మీద శతకం రాసిన కుమ్మరి కేసన కూతురీమె.

ఒక కోయ యువకునితో మొల్లకు స్నేహమవుతుంది. దేవుణ్ణి చూడాలనీ తెలుసుకోవాలనీ ఆరాటపడే మొల్లకు, పరిపక్వత, పరిపూర్ణత్వం కలిగించిన ఆ కోయ యువకుడు, తల్లి, తండ్రి, గురువు, పరాశక్తి - నలుగురు దేవుళ్ళనీ, ప్రణయోన్మాదమూ ప్రేమ తత్త్వమూ అధిగమించి, తండ్రికి శుశ్రూష చేయమనీ, వనభూముల నుంచి ప్రజల మధ్యకి పంపుతాడు. భక్తి జ్ఞానాలు పొందిన మొల్ల, తెనాలి రామలింగనితో వాగ్వాదం పెట్టుకు, ఆయన అయిదేళ్ల గడువీయగా, ఈమె అయిదు రోజులలో రామమందిరంలో కూచుని, రామాయణం వ్రాసి, రామ చంద్ర ప్రభువులో ఐక్యమవుతుంది. నేటి సామాజిక సమస్యలని, ఆనాటి వాతావరణంలో ప్రవేశబెట్టి చెప్పిన సినిమాకథ యిది.

'తేనె సోక నోరు తీయన యగు రీతి, తోడ నర్థ మెల్ల తోచునట్లు' - రామాయణం చెప్పిన మొల్ల ఎవరు? కవిత్వం ఆమెకు ఎలా అబ్బింది? బ్రాహ్మణకన్యా? కుమ్మరి కులంలోని 'గురులింగ జంగమార్చకుడు' ఆతుకూరి కేసన స్వంత కూతురా, పెంపుడు కూతురా? శ్రీకృష్ణ దేవరాయని వుంపుడు కత్తెయా? వితంతువా? విరాగిణియా? రసికత నెరిగిన దేవదాసియా? ఈ ప్రశ్నలకు సమాధానం జెప్పగల చారిత్రకాధారాలేమీలేవు. పదిమందికీ అర్థమయే స్వచ్ఛమైన భాషలో, తేట తెనుగులో రామకథ చెప్పిన పుణ్యాత్మురాలు. 'రాజిత కీర్తియైన రఘురాము చరిత్రము మున్ గవీశ్వరుల్ - తేజ మెలర్ప జెప్పిరని తెల్సియు గ్రమ్మఱ జెప్పనేల నన్ - భూజన కల్పకం బగుచు భుక్తికి, ముక్తికి మూలమైన యా - రాజును దైవమైన రఘురాము నుతించిన దప్పు గల్గునే' - అన్న మొల్ల కథను, ఇంటూరి వారు సినీ సరళిలో చక్కగా చెప్పారు.

—క్షీరసాగరమ్

'మా మంచి మాస్టారు' (నవల) రచన : డా॥ కె. రవీంద్రబాబు. ప్రచురణ : నవజ్యోతి పబ్లికేషన్స్, ఏలురు రోడ్డు, విజయవాడ - 520 002.... వెల: రు. 20-00.

'మా మంచి మాస్టారు' నవల 'ఆంధ్ర జ్యోతి' వారపత్రికలో ధారావాహికంగా వెలువడింది. ఈ నవల లోని 'మా మంచి మాస్టారు' రాజారావుగారు. ఆయన ఉపాధ్యాయునిగా ఎక్కడకు వెళ్ళినా అక్కడే తన వృత్తికి అంకితమైపోయి విద్యార్థులను తీర్చిదిద్దడానికి ఎన్నోకష్టాలను ఎదుర్కొంటారు.

"జిల్లా మొత్తంలో ఏది మరీ పనికిమాలిన స్కూలైతే, నన్నక్కడ వేయండి. కొంత కాలం పాటు నన్నక్కడ పని చేయనివ్వండి. అయితే, నాకు ఫ్రీహాండ్, యిచ్చి, అన్నివిధాల

నాతో సహకరించండి. స్కూలును రాష్ట్రంలో మొదటి స్కూలుగా తీర్చి దిద్దుతానోలేదో చూడండి" అని ఆత్మ విశ్వాసంతో చెప్పగలిగిన రాజారావు లాటి మాస్టారులు ఎక్కడోగానీ తారసపడరు.

విద్యార్థులంతా తన పిల్లలుగా వారిలో ఎవరూ చదువుకు అనర్హులు కాదని భావించి, వారిని పైకితేవడానికి అహర్నిశలు శ్రమపడ్డ దక్షిణామూర్తి గారి వద్ద చదువుకొని, తన గురువు గారు అమలుపర్చాలన్న పథకాలను, ఆయన తదనంతరం అమలు పర్చుతూ, ఆమాటే ఎంతో వినయంగా చెప్పుకోగలిగిన ధీశాలి రాజారావు మాస్టారు.

మెహాజిత్, మనీషితలు చదువు కోవాలన్న కాంక్షలో పడిన కష్టాలు, మనసును కలచి వేస్తాయి.

జ్యోత్స్నానాథ్‌లు, వాసుకిలు - ప్రతి స్కూల్లోను వుంటారు. కానీ, తను చేపట్టిన ఉపాధ్యాయ వృత్తిని చిత్తశుద్ధితో, కష్టపడి పనిచేసి అందరి మనసులను దోచుకొన్న రాజారావు గారి లాటి మాస్టారులు, స్కూలు కొకరైనా వుంటే.... 'ఆహా....' అని .... నవల చదివాక.... అనుకుంటుంది పాఠకుని మనసు.

—అన్నపూర్ణా రెడ్డి

# వసంత విలాసం

ప్రతి యిందు కిరణం
తెలి మబ్బు శకలం
చిరు గాలి కెరటం
ఒక వసంత సందేశం

తళుకు లీను తారలు
మినుకు మనే మిణుగురు
చిలిపి పిట్టల పాటలు
పలుకు వసంత గానాలు

కనులు తెరచిన మల్లిక
మత్తు జల్లు మాలతి
హసన ముఖి పద్మిని
పంచేరు పరిమళ వసంతం

గడ్డి పోచలకు ముక్తాహారం
ఎండు మ్రోడు కొక కెంపుల పేరు
ఎద ఎదలో కవితా భరణం
ఇదంతా వసంత ప్రమోదం

గుండె తంత్రులు మీటినా
స్మృతుల పొరలు కదిలినా
హృది మృదువుగ పాడినా
అది మధు మాసపు విలాసం.

చీకటి తెరలు చీల్చాలని
నవలోకపు తలుపులు తెరవాలని
యువత పడే ఆరాటం
అదే అసలు వసంత ఆగమనం

వెలితి లేక మనసులు
లేమి లేని మనుష్యులు
విశ్వమంత శాంతి వాకలు
నిజంగా అది వసంత శుభోదయం.

—సరోజినీ ప్రేమ్‌చంద్

JAGATI Rs. 2-00 June 1992

37th Year of Publication




**431**

జూన్ - **1992**

## సాహితీ సుధ

ఇంచుక ముద్దు లేనగవు లింపగు నవ్య విలాససూక్తు ల
భ్యంచిత లోలదృష్టియు నవారుణ పల్లవ మండలంబు ని
ర్మించు సలీల యానములు మేలుగ యౌవన లక్ష్మి తోడ వ
ర్తించు మృగాక్షి చందము లతి ప్రమదంబు ఘటింప జాలవే

—భర్తృహరి



మృగనాభి నికరంపు బుగబుగల్ కలచోట - జదలేటి తుంపురుల్ చెదరు చోట
వకుళవాటీ గంధవహుండు పైకొను చోట - గుర్భూర తరు ధూళి గప్పు చోట
బసమీఱు సెలయేఱు లిసుక వెట్టిన చోట - జిగురు మావుల సంజ నిగుడు చోట
నవమాలికల తీవె నట్లుట్టి వడు చోట - మాణిక్య దీపముల్ మలయు చోట
భ్రమమున దేటు లెలుగెత్తి పాడు చోట - శారికా లంగ శాస్త్రముల్ చదువు చోట
గిరికల కంఠముల్ క్రొవ్వి కేరు చోట - బావురము లారజంబులు పలుకు చోట

— వనవర్ణన - అల్లసాని పెద్దన 'మనుచరిత్ర'



'జ గ తి' - 2, కచేరీ రోడ్, మైలాపూర్, పి బి 2922, మద్రాసు - 600 004
ఫోన్ : 76697 - చందా 2 సం॥లకు రు. 50-00 - 4 సం॥లకు రు. 100-00- జీవిత
చందా రు. 300-00. పాట్రన్ - రు. 1000-00. విదేశాలలో పాట్రన్ రు. 2000-00

ముఖచిత్రం : రాజీవ్ గాంధీ

# నిమ్మతొనలు

అటజని గాంచె భూమిసురు డంబర
చుంబిత.... ఏమి చూశాడురా, గోపీ ? - అని ప్రశ్నించాడు టీచరు.

ఇటూ అటూ బిత్తరపోయి చూస్తూ, తన సీటులో నిలబడి 'నాకు తెలిదు, సార్' - అన్నాడు గోపీ.

'శీతశైలము చూశాడు - అంటే హిమవత్పర్వతాన్ని. ఈ పద్యం 'మనుచరిత్ర' లోనిది. 'మనుచరిత్ర' వ్రాసిన దెవరు ?' - అని ఈసారి సోమూని అడిగాడు టీచరు.

'నాకు తెలీదు, సార్' అన్నాడు సోమూ.

'ప్రసాద్ ?'

'తెలీదు, సార్'

తనకు తెలుసునన్నట్లు నిలబడ్డాడు రఘు.

చెప్పమన్నాడు టీచర్.

'పెద్దయ్య'

టీచరు చిరునవ్వుతో అన్నాడు : 'మీ పెద్దయ్య, మా పెద్దయ్య కాదు - అల్లసాని పెద్దనామాత్యుడు.'

—యమ్ సోమశేఖర్
అమలాపురం

రాజేష్, ఈ సుజాత నన్నింత దగా చేస్తుందనీ, అన్యాయం చేస్తుందనీ అనుకోలేదు- అని వాపోయాడు శేఖర్.

'ఏం బ్రదర్ ఏం చేసింది - సుజాత నీతో బాలా 'ఛమ్మీ'గా ఉండేది కదా !' - ప్రశ్నించాడు రాజేష్.

'నన్ను యిరుకున పెడుతోంది - నేను ఆమెని తెనియక ప్రేమించాను.'

'నీవు కాదని మరొకరిని ప్రేమిస్తోందా ?'

'అదేం కాదు, పెళ్లి చేసుకోమంటోంది.'

'సహజం కద !'

'నేను ప్రేమించాను గాని పెళ్లి చేసుకుందామనుకోలేదు. తనని పెళ్లి చేసుకోకపోతే, నేను వ్రాసిన ఉత్తరాలన్నీ 'నారీ నికేతన్' వారికి వొప్పగిస్తుందట. అంత పనీ చేస్తే, నా ఉద్యోగం ఊడుతుంది.'

'సినిమాలలోకి మల్లే నీ కాళ్లా వేళ్లా పడుతుందను కున్నావా నాయనా ? ఎడ్యుకేటెడ్ గరల్ అంటే ఏమిటను కున్నావ్ ?' - అని మిత్రుని ఓదార్చాడు రాజేష్.

—యమ్ శ్రీనివాసరావు
ఫిరంగిపురం

రచయిత రాంబాబు కొత్తగా పెళ్లి చేసుకున్నాడు. ఆరు నెలలు తిరక్కుండా భార్యాభర్తలు విడిపోవటం ముకుందానికి ఆశ్చర్యం కలిగి,

'ఏమయ్యా రాంబాబూ, అంత తొందరగా పెళ్లి చేసుకు, అంత తొందరగా విడిపోయారు - ఏమిటి కథ ?' - అని అడిగాడు.

'మా ఆవిడే విడాకులు యిచ్చింది.'

'అదే - ఎందుకిచ్చిందని ? కారణమంటూ ఏదో ఒకటి వుండాలి' - అని ముకుందం ప్రశ్న.

'నేను రచయితని కదా - ప్రతి రచన వెంట హామీ పత్రం పంపడం నా అలవాటు.'

'ఊ'

"'ఈ వివాహానికి పూర్వం పర పురుషుని ఎరగను' - అని హామీ పత్రం రాసివ్వమన్నాను. ఆ సాయింత్రమే పుట్టింటికి వెళ్లిపోయింది. నాలుగు రోజులలో విడాకుల నోటీసు వచ్చింది."

—పియమ్ సుందరరావు
విజయవాడ-8

బంధువులని మద్రాసు ఎక్స్‌ప్రెస్‌లో ఎక్కించడానికి నాంపల్లి స్టేషనుకొచ్చిన శ్యామలరావుని, కుశల ప్రశ్నలయాక, పరాంకుశం 'మీ కాలనీలో నీళ్ల బెడద ఎలా ఉంది ?' అని అడిగాడు.

'సగం తగ్గింది.'

'అదేమిటి, మీ కాలనీ నుంచి నిన్న సెక్రటేరియట్‌కి కొందరు పెద్ద మనుషులు వచ్చి కంప్లయింట్ చేశారు నీళ్లు రావడం లేదని ... సగం తగ్గిందంటావేమిటి ?'

'కంప్లయింటూ నిజమే - సగం బెడద తగ్గడమూ నిజమే !' - అన్నాడు శ్యామలరావు.

'నాకు బోధపడటం లేదు.'

'బోధపరుస్తాను. రోజూ తెల్లవారు జామున మూడు గంటలకి నీళ్లు వచ్చేవి ఇంట్లో - ఎవరికీ నిద్దర్లు వుండేవికాదు. ఈ మధ్య నెల్లాళ్లగా రోజు విడిచి రోజు వస్తున్నాయి. సగం బెడద తగ్గినట్లేగా !'

—కె వెంకటరామయ్య
పామర్రు


జి. పుల్లా రెడ్డి
స్వచ్ఛమైన నేతి మిఠాయి

హైదరాబాదు ఫోను : 230833
కర్నూలు ఫోను : 20288, 21445

# పాఠకుల తీర్పు

యన్నార్ గారికి నమస్కారములు. 'కొత్త పుస్తకాలులో', రాధికా ప్రణయం, గోపికా హృదయం మీద సుమతీ సాగర్ రివ్యూ చూసి చాలా ఆనందించినాను.... మిమ్మల్ని విమర్శించే శక్తి, చనువూ నాకు లేవు. మిమ్మల్నెప్పుడూ నేను చూడలేదు - చూసేది 'డైరీ' ద్వారానే! సంపూర్ణ అవగాహన దొరక్క, రాస్తున్నాను.... ఏదో ఇంద్రలోకంలోని వైభవాలు, సౌందర్యాలు, సంగీత నృత్యాలు, పెద్ద పెద్ద భవనాలు, గొప్ప గొప్ప స్నేహితులు, సైంటిస్టులు, సినీ యాక్టర్లు, కార్లలో తిరగడం, విందుల్లో పాల్గొనడం - యివన్నీ చదువుతూంటే, ఒక్కోసారి కళ్లు గిర్రున తిరుగుతాయి. మీరెందరి హృదయాలలో మెరుపులా మెరుస్తూంటారో అపినిస్తుంది - అదృష్టవంతులు - బిజీ, బిజీ దినచర్య .... ఇంతకీ మీకోసం మీరు ఏం చేసుకుంటున్నారండీ? గుప్పెడు ఆధ్యాత్మిక చింతనా విత్తనాలు చల్లి, వెన్నెల అనే ప్రేమనీటితో తడిపితే గాని పరిపూర్ణత లభించదేమో!

—త్రిపుర
శ్రీరాంనగర్

చందూర్ గారికి : శుభాకాంక్షలతో .... కేసరి గారి 'చిన్ననాటి ముచ్చట్లు' తర్వాత, తల్లాప్రగడ ప్రకాశరాయడి గారి 'నా రాట్న చక్రం' ధారవాహికంగా ప్రచురించటం చాలా బాగుంది. మారుతూన్న సామాజిక పరిస్థితులకు దర్పణం రెండూను. 'డైరీ' లోని విషయాలను, సన్నిహిత స్నేహితులతో చెప్తున్నట్టుగా వ్రాసే శైలి, ఆ ప్రతిభ చాలా అరుదు. ఛార్లెస్ లాంబ్ Personal Essays మీ 'డైరీ' కి దగ్గరగా రావచ్చును. తెలుగులో యిది క్రొత్త ప్రక్రియ అని నా అభిప్రాయం. సాహితీ సుధ, పాతికేళ్లనాటి పిక్చర్, మానవ ప్రగతి వంటి శీర్షికలు బావున్నాయి - Very useful and Informative.

—ఎవి కృష్ణారావు
మద్రాసు-36

ఆప్తమిత్రులు చందూర్ గారికి నమస్కారములు. కేంద్ర సాహిత్య అకాడమీ వారు యంగర్ జనరేషన్ రైటర్స్ కథా సంకలం ప్రచురించాలని తలపెట్టారు - యంగర్ అంటే 30-40 మధ్య. పాతికేళ్ల వారిని కూడా చేర్చవచ్చు - కథలు మంచివైతే! ఇప్పుడు రాయలసీమ ప్రాంతంలో బాగా వ్రాస్తున్నారు. కోస్తాలోను, తెలంగాణాలోను తక్కువ. కెఆర్ శ్రీనివాస య్యంగార్ గురించి మీరు 'జగతి' లో చెప్పినది నాకెంతో నచ్చింది.

—డి రామలింగం
హైదరాబాదు-44

## వెన్నెల కెరటాలు

### స్వీయ చరిత్రం

అప్పారావుగారు 1880-90 మధ్య తమ 'కన్యాశుల్కం' నాటక రచనకై వివాహాల వివరాలు సేకరించినట్లు తెలుస్తుంది.... మన తెలుగువారి తొలి స్వీయ చరిత్రలు 19వ శతాబ్ది తెలుగు పల్లెలు పట్నాలు, ఆచార వ్యవహారాలు, పరిపాలనా వ్యవస్థ, నాటి వృత్తులు, ఉద్యోగాలు, ప్రజల మనోబుద్ధులు మున్నగు జాతి జీవన విధానాలను ప్రతిబింబిస్తాయి. వీరేశలింగం పంతులుగారి (1848-1919) 'స్వీయ చరిత్ర', ఏనుగుల వీరాస్వామిగారి (1760-1836) 'కాశీయాత్ర చరిత్ర', ఆదిభట్ల నారాయణదాసుగారి 'నా యెఱుక', కోవలో - రాంబొట్ల జగన్నాథశాస్త్రి (1850-1916) 'స్వీయ చరిత్రము' వాటి సరసన స్థానమీయ తగ్గది. గురజాడవారి ప్రస్తావన వున్న ఈ స్వీయచరిత్రకు విశాఖపట్నం జిల్లా ఆధార క్షేత్రం.

—మనూనా
'ఎక్సరే' లో

### 'మన్నిమాల' అబ్రహాము

క్లిష్ట పరిస్థితుల్లో మన్నిమాలలోని దళిత నాయకుడైన ఎలాసరి అబ్రహాము ప్రదర్శించిన ప్రజ్ఞ గణనీయమైనది. మన్నిమాల దళితులను చైతన్యవంతులను చేయడంలో కడు విశిష్ట పాత్రను వహించారు. దళితులందరినీ సమీకరించి, కరువు నెదుర్కోడానికి, పలు పథకాల ద్వారా మన్నిమాల అభివృద్ధిని సాధించడానికి "ది రూరల్ డెవలప్‌మెంట్ లాండ్ అగ్రికల్చరల్ లేబరర్స్ అసోసియేషన్" ఏర్పాటుచేసి దానిని ప్రభుత్వంలో నమోదు చేశారు. తర్వాత దళితులను సంఘటిత పర్చి, ఒక శక్తిగా రూపొందించారు. అబ్రహాం నాయకత్వంలో, ఆ సమాజసభ్యులు, డివిజన్ పర్ సోషల్‌యాక్షన్ అధినేత డా॥ రాజరత్నంగారిని కలుకొని, వారికి తమ పరిస్థితిని తెలియజేశారు. డా॥ రాజరత్నంగారు వారి బాధలను కూలంకషంగా అర్థం చేసికొని, తగిన ఆర్థిక వనరుల నేర్పరచి, 71 ఎకరాల పొలం తిరిగి కొని, ఒకొక్కరికి 2 ఎకరాల చొప్పున వారి వారి పేర్లపై నమోదు చేసి, వారికి యాజమాన్య పత్రాలను అందించారు.

—వ్యాసభాగం
'ప్రజా పక్షం'

# పాతికేళ్ల నాటి పిక్చర్

శ్రీదేవి వారి

## 'భువన సుందరి కథ'

ఎగిరే పల్లకీ, పరకాయ ప్రవేశం- ఈ చిత్రంలోని ప్రత్యేకతలు. గ్రీకుల రెక్కల గుర్రాలు, మధ్య ప్రాచ్య కథలలోని మాజిక్ కార్పెట్, గంధర్వుల కామ రూపమూ ఆకాశగమన విద్య - యిటువంటి అద్భుతలోక వింతలు సామాన్య జనావళిని ఎప్పుడూ ఆకర్షిస్తూనే వుంటాయి. ఈ చిత్రంలోని ఎగిరే పల్లకీకి కొన్ని మీటలు వున్నాయి. ఇది హెలికాప్టర్‌కీ, గంధర్వ శిల్పి పనితనానికీ మధ్యస్థంగా వుండి, చంద్ర సేనుని (యన్‌టి రామారావు), భువన సుందరి (కృష్ణ కుమారి) మేడమీదకి తెచ్చి, మంచి వాళ్లనీ చెడ్డవాళ్లనీ మందకొడులనీ మూర్ఖులనీ కథాగమనానికి అనుకూలంగా విభజిస్తుంది.... 'పూలమాల – పులినోరు' వంటి లాటరి చీట్లతో న్యాయనిర్ణయం జరిపించే కాంచీ పురాధిపతి హిరణ్యవర్మ (మిక్కిలినేని) కుమార్తె భువన సుందరిని, రాజగురువు (ధూళిపాళ) తనయుడైన దేవదత్తుడు (సత్యనారాయణ) బలాత్కరిస్తూంటే, సమయానికి పెద్దలు వచ్చి అడ్డుపడతారు. అంతఃపుర ద్రోహిని భువనేశ్వరీ పీఠానికి (పూలమాల - పులినోరు) వొప్పజెబుతారు. కుతంత్రుడైన రాజగురువు, దుష్టుడైన దేవదత్తుడు - వీరికి ప్రతిగా విచిత్ర సేనుని (ముక్కామల) కుమారుడు చంద్రసేనుడు - అంటే కథానాయకుడు.... బ్రహ్మరాక్షసి రూపం దాల్చిన అందమైన యక్షకన్య, యితని వల్ల శాపవిమోచన పొంది, పరకాయ విద్య ఉపదేశించటం, రూపు మారిన తిప్పయ్య (గూని) చంద్ర సేనుని వంచించి, కొన్ని కడగండ్ల తర్వాత లెంపలు వాయించుకోవటం. ఎగిరే పల్లకీ పరకాయ విద్య వుండి కూడా దుర్విధి పాలైన చంద్రసేనుని ఒక ఎలుగుబంటి దరికి చేర్చటం - వింత మలుపులతో కూడిన ఈ చిత్ర గమనానికి అనేక ముళ్లువేసి, నేర్పుగా విప్పారు జివిజి. ఘంటసాల సంగీతమూ, ఆచార్య సంభాషణలూ బావున్నాయి. రాకుమారుని రీవిలో రామారావు రాణిస్తే, భువన మోహినిగా, భువన సుందరిగా, కృష్ణకుమారి ప్రేక్షక హృదయాన్ని ఆకట్టుకుంటుంది. మిగతా అందరూ తమ పాత్రలకు న్యాయం చేకూర్చారు. దర్శకత్వం : సి పుల్లయ్య. నిర్మాత : తోట సుబ్బారావు.

—యన్నార్ చందూర్ సమీక్ష
'జ గ తి'-జూన్ 1967

## మానవ ప్రగతి

3

### వినియోగదారు

భారతదేశం వినియోగదారులకు, చట్టపరంగా కొంత రక్షణ కల్పిస్తున్నది. ఉదాహరణకు, ఆహార పదార్థాలు, మందులు, అలంకరణ వస్తువులలో కల్తీ నివారణ, ప్రామాణికత, తూనికలు, కొలత వంటి వాటిలో వినియోగదారుని ఆదుకుంటున్నది. మనదేశంలో ప్రప్రథమంగా 1986 లో సమగ్ర, సమన్వయ దృష్టితో వినియోగదారుల చట్టానికి సంస్థా పరంగా నాంది పలికారు. మోస పోయిన వినియోగదారులు నష్టపరిహారార్థం వ్యాపారస్తుని మీద లేక ఉత్పత్తి దారుని మీద అధికారులకు ఫిర్యాదు చేయవచ్చును. ఈ ఫిర్యాదులను స్వల్పకాలంలోనే ఎలాంటి ఖర్చు లేకుండా పరిష్కరిస్తున్నారు. ఈ చట్టం అమలుకు కేంద్ర, రాష్ట్ర జిల్లా స్థాయిల్లో మూడంచెల వ్యవస్థను ఏర్పాటు చేశారు. జిల్లాస్థాయితో వినియోగదారులు, జిల్లా ఫోరంకు ఫిర్యాదు చేసికుని నష్టపరిహారం పొందవచ్చును. జిల్లా ఫోరంకు జిల్లా జడ్జి అధ్యక్షులుగా ఉంటాడు. జిల్లా ఫోరంలో ఫిర్యాదు చేసుకోటానికి వినియోగదారుడు ఎలాంటి స్టాంపు ఫీజును చెల్లించవలసిన అవసరం ఉండదు. కేవలం అతను తన ఫిర్యాదును దరఖాస్తు రూపేణ జిల్లా ఫోరానికి సమర్పించుకోవాలి. జిల్లా ఫోరం ఇలాంటి ఫిర్యాదులపై తక్షణమే తీర్పులను ఇస్తుంది. జిల్లాస్థాయి ఫోరంలో లక్షరూపాయల లోపు విలువ వస్తువుల ఫిర్యాదులను మటుకే స్వీకరిస్తారు. ఈ చట్టం క్రింద ఫిర్యాదు చేసుకునేందుకు వీలున్న రాష్ట్ర కమీషన్ను ఏర్పాటు చేసారు. అలానే జాతీయస్థాయిలో అత్యున్నత స్థాయిలో జాతీయ వినియోగదారులు వివాదాల పరిష్కార సంఘం, ఫిర్యాదుల పునః పరిశీలన, చట్ట పరిధిలో నిర్ణయాలు, పరిశీలన మొదలైన చర్యలు చేబడుతుంది. వినియోగదారుల సమస్య పరిష్కారానికి దేశంలో ఎలాంటి చట్టాలు లేని పరిస్థితులలో ఈ చట్టాన్ని దేశంలో ప్రప్రథమంగా రూపొందించినందువలన వీటిలో అనేక లోటుపాట్లు ఉన్నట్లు గ్రహించారు. ఈ చట్టాలలో లోటుపాట్లను సవరించ

టానికి కేంద్రం ఒక అధ్యయన బృందాన్ని ఏర్పాటు చేసింది. దేశంలో వినియోగదారుల ఉద్యమం నడిపించటంలో స్వచ్ఛంద సంస్థలు ముఖ్య పాత్రను వహించాయి. ఈ సంస్థలు అధికార యంత్రాంగం జోక్యం లేకుండా నడిపించాలని కోరుతున్నాయి. స్వచ్ఛంద సంస్థలు, కేవలం పట్టణాలకే పరిమితం చేయకుండా పల్లె పల్లెలకు తీసుకువెళ్లాలి.

(ప్రెస్ ఇన్‌ఫర్మేషన్ బ్యూరో

## 'డిస్కవరీ'

ఈ ఏడాది (1992) అమెరికా ప్రయోగించదలచిన మొత్తం ఎనిమిది రోదసీ విమానాలలో (స్పేస్ షటిల్స్) మొదటిది ఇటీవల అంతరిక్ష యాత్ర జరిపిన సందర్భంగా అందులో రోదసీలోకి వెళ్లిన అంతర్జాతీయ పరిశోధకులు.... 14 దేశాలకు చెందిన 200 మందికి పైగా శాస్త్రవేత్తలు సమకూర్చిన ప్రయోగాలను అక్కడ నిర్వహించారు. ఈ ప్రయోగాల ద్వారా సముపార్జించిన పరిజ్ఞానం పదార్థాలు, జీవశాస్త్రాలపై నూతన అవగాహన ఏర్పాటుకు దోహదం చేసి భూమిపైన గల వారందరికీ ప్రయోజనం చేకూర్చగలదని అంటున్నారు. ప్రయోగించదలచిన ఎనిమిది రోదసీ విమానాలలో మొదటిదిగా 'స్పేస్ షటిల్ డిస్కవరీ' ఇటీవల అంతరిక్షయాత్ర జరిపినప్పుడు దానితోపాటు.... దాని సరుకుల గది (కార్గోబే)లో ఒదిగి.... 7 కోట్ల డాలర్ల 'స్పేస్ లాబ్' కూడా రోదసీ ప్రవేశం చేసింది. ఈ 'స్పేస్ లాబ్' (అంతరిక్ష పరిశోధనాశాల) అనేది అన్ని పరికరాలు అమర్చిన ఒక 'ప్రెషరైజ్డ్' ప్రయోగశాల. 'డిస్కవరీ' ఎనిమిది రోజుల అనంతరం మళ్లీ భూమికి తిరిగివచ్చింది. మొక్కలు, కీటకాలు, స్ఫటికాలు, వ్యోమగాముపై అల్పగురుత్వాకర్షణ (లోగ్రావిటీ) ప్రభావం ఎలా వుంటుందనే అంశంపై ఈ ఎనిమిది రోజుల కాలంలో షటిల్‌లోని వ్యోమగాములు నిరంతర పరిశోధనలు జరిపారు ఈ ప్రయోగాల నుంచి సేకరించిన సమాచారం భవిష్యత్తులో చంద్రుని మీదికి, అంగారకుని పైకి జరిపే దీర్ఘకాలిక వ్యోమయాత్రలకు ఎంతైనా ఉపయుక్తం కాగలదని భావిస్తున్నారు. 'డిస్కవరీ' వ్యోమగాములలో ఆరుగురు పురుషులు, ఒక మహిళ ఉన్నారు. ఈ యాత్ర సందర్భంగా 'స్పేస్ లాబ్'లో నిర్వహించిన ప్రయోగాలలో కణాలు, మొక్కల పెరుగుదలకు సంబంధించిన మౌలికాంశాల నుంచి.... 'భార రహిత స్థితికి మానవశరీర ప్రతి స్పందన' అనే సంక్లిష్ట అంశం వరకు పరిశోధనలు జరిగాయి. కక్ష్యలో దీర్ఘకాలం గడపడానికి లేదా రోదసీలో సుదీర్ఘ ప్రయాణాలు చేయడానికి ముందు అక్కడ (అంతరిక్షంలో) రేడియేషన్, తగ్గిన గురుత్వాకర్షణ అనేవి ప్రాణులపై ఎట్టి ప్రభావం చూపుతాయనేది తెలుసుకోవడం ముఖ్యం. చంద్రునిపై ఒక కాలనీ కట్టుకోవడానికి లేదా,

అంగారకునిపైకి యాత్ర ప్రారంభించ డానికి ముందు ఈ అంశాలను క్షుణ్ణంగా తెలుసుకోవలసి వుంది. పటిష్టమైన లోహాలు, వ్యాధినిరోధక ఔషధాల అభివృద్ధికి అవసరమైన స్వచ్ఛమైన స్ఫటికాల పెరుగుదలపై ప్రధానంగా దృష్టి కేంద్రీకరించి కొన్ని పదార్ధ సంబంధిత శాస్త్ర విజ్ఞాన ప్రయోగా లను కూడా 'స్పేస్ లాబ్'లో పరిశోధ కులు నిర్వహించారు. ఈ పరిశోధనలు మరింత సమర్ధమైన వ్యాధినిరోధక ఔషధాల రూపకల్పనకు దారితీయ గలవని భావిస్తున్నారు వ్యోమ గాములు కొన్ని గోధుమ మొక్కలను కూడా 'స్పేస్ లాబ్'లో పెంచి మొక్కలు పెరిగే 'దిశ' పైన భార రహిత స్ధితి ప్రభావం ఎలా వుంటుం దనేది కూడా పరిశీలించారు. భార రహిత స్థితిలో కూడా గోధుమ మొక్కలు పెక్కు సెంటిమీటర్ల ఎత్తుకు పెరిగి అన్ని దిశలలోకి వాలు తుండడం పరిశోధకులకు సంభ్రమం కలిగించింది. భార రహిత స్ధితిలో వ్యోమగామి శరీరంలో రక్త ప్రవాహం ఎలా వుంటుందనే అంశాన్ని 'డిస్క వరీ' యాత్రలో మరొక ప్రయోగం ద్వారా తెలుసుకున్నారు... అంతరిక్ష యాత్ర సమయంలో వ్యోమగామి శరీరంలో రక్తం, ఇతర ద్రవాలు, ఛాతీ, తల భాగాలకేసి ప్రవహిస్తాయి. దీనివల్ల భూమికి తిరిగొచ్చాక మగ తగా అనిపిస్తుంది.

(అమెరికా మాసపత్రిక శాఖ

## శాఖాహారం

దక్షిణాఫ్రికాలోని భారతీయుల ఓటు హక్కు, స్వాతంత్ర్యం కోసం ఇతోధిక కృషి సలిపే సమయంలోనే గాంధీజీ అక్కడ 'నటల్' అనే రాష్ట్రం లో ఉంటూ, శాఖాహార ప్రచారానికి పూనుకొన్నారు. అది 1895 సంవ త్సర ప్రాంతం. దక్షిణ ఆఫ్రికాలో శాఖాహారిగా ఉండడం ఆ రోజుల్లో చాలా కష్టం. లండన్ నగరంలో కొంచెం సులువే గానీ నటల్‌లో పళ్లు, కూరలు దొరకవు. తొమ్మిది నెలలు ప్రచారం చేశారు. బంగారు గనులపై ఉన్న శ్రద్ధ, ఆసక్తి, వ్యవసాయంపై లేవు. 'వెజిటేరియన్' అనే పత్రిక అన్ని లైబ్రరీలకు వెళ్లేది. వార్తా పత్రికల్లో ఎడ్వర్‌టైజ్‌మెంట్స్ కూడా వేసేవారు. కొన్ని ఉత్తరాలు, పుస్తకాలు రావడం మొదలయింది. కొన్నిట్లో హాస్యము, అపహాస్యము ఉండేవి. ఈ శాఖాహార ప్రచారం ఒక మత ప్రచారంలా ప్రపంచమంతటా సాగాలనీ, శాఖా హార పంటలు పండే అనువైన ప్రదే శాలకి ప్రజలు తరలి వెళ్లాలని, ఈ ఉద్యమ పరిధి మరింత విశాలం కావాలని గాంధీజీ ఆరోజుల్లో కోరు కునేవారు. ఉపయోగకర జంతువులు ఆవులు, ఎద్దులు, గుఱ్ఱాలు శాఖా హారులు. ఉపయోగపడని ప్రమాదకర జంతువులు మాంసం మీద జీవిస్తాయి.

(సర్వోదయా ప్రెస్ సర్వీస్





"Kaikeyi was a queen in her own right, born into a royal family and brought up in a regal way. How could she be carried away by the evil tongue of a servant-maid like Mandhara? Knowing fully well that it was the eldest son to succeed the throne, how could she make such a stupid request of asking her son to be crowned?" questioned Raghu.

"Dasaratha granting two boons on a battle-front, the divine curse of a blind couple who lost their son by Dasaratha's misdeed, Mandhara playing the devil at the opportune moment - these and many more such examples are only a background for banishment," said Raghu's father.

"I wonder what prompted Bharata to refuse?"

"Implicit obedience to the elder brother Rama, the incarnation of Lord Vishnu. Take it from me, all the characters are firm on their ground excepting Dasaratha, the vacillating old king This Dasaratha, in his thoughtlessness and carnal desire promised Yudhajit (Father of Aswapati, Bharata's uncle) that he would make Kaikeyi's son the future king of Ayodhya. Only on that clear assurance did Yudhajit give his daughter in marriage to Dasaratha. And after marriage, Dasaratha was so enamoured of his third wife that he became a captive, neglecting his duties. Kaikeyi was never harsh - she claimed the promised right to her progeny but Bharata defied his mother upholding *Dharma*," explained Raghu's father.

---

*Swadharma Swaarajya Sangha (Director : BVSS Mani*
*Beehive Bldgs - 29, Prakasam Road, Madras - 600103.*

# ప్రసంగ పాఠం



కలకత్తా ఆంధ్రా అసోసియేషన్ వారు మాలతీ చందూర్‌ని, సత్కరించాలని అనుకోవడం వల్ల, 1992 మార్చి 29 వ తేదీ సాయంత్రం ఆరుగంటలకు అక్కడికి వెళ్లాము. ఏడుంబావుకి మరొక చోటుకి, అంటే భారతీయ భాషా పరిషత్తుకి, వెళ్లవలసి వుంది. టైము చాలక నేను చెప్పలేక పోయిన ప్రసంగ పాఠమిది :

వేదిక మీదున్న మాన్యులకు, అత్యంతాప్తులు శివస్వామీ దంపతులకు, కలకత్తా ఆంధ్రమహాసభ కార్యవర్గ సభ్యులకు, ఈ సమావేశానికొచ్చిన యావన్మందికి, మాలతీ - చందూర్ల మనఃపూర్వక నమస్కారాలు.

కలకత్తా ఆంధ్రా అసోసియేషన్ అనగానే 'చందమామ' రామారావుగారు జ్ఞాపకం వస్తారు. నలభై ఏభై ఏళ్ల క్రితం ఆయన యిక్కడ, మీ అసోసియేషన్ తెలుగు స్కూలులో టీచరుగా పని చేసి, రామానంద ఛటర్జీ 'మోడరన్ రెవ్యూ'లో - మీలో బహుకొద్ది మంది ఆ పత్రిక పేరు విని వుంటారు- ఆ మోడరన్ రెవ్యూలో తెలుగు పుస్తకాలు సమీక్షిస్తూ, యిక్కడ నుంచి 'ధర్మపత్ని' సినిమా తీసేందుకు పి పుల్లయ్యగారితో కొల్హాపూర్ వెళ్లి, డైలాగులు రాసేందుకు చక్రపాణిని అక్కడికి రప్పించి - చక్రపాణి అసలు పేరు ఎవి సుబ్బారావు ; ఆ పేరుతో రాస్తే ఆకర్షణీయంగా ఉండదని చక్రపాణిగా పెన్‌నేమ్ పెట్టుకున్నానని ఆయనే ఒకసారి చెప్పారు - ఆ చక్రపాణి, ఈ రామారావుగారు, మద్రాసు ఆచారప్పన్ వీధిలోని 'చందమామ' చేరుకున్నారు. ఆ 'చందమామ' ఈ నాడు తెలుగు జాతికే గర్వకారణంగా, పధ్నాలుగు భాషలలో వెలువడుతున్న ఏకైక పత్రిక.... 'చందమామ' రామారావుగారు ఈ మధ్యనే భువిలోని 'చందమామ'ని వొదిలి, దివిలోని చుక్కల్లోకి వెళ్లారు.

నాకు మల్లేనే ఆయనకి కూడా 'ప్రవాస' అనే శబ్దం యిష్టం వుండేది కాదు. మన దేశంలో మనం ప్రవాసుల మేమిటి ? - రాష్ట్రేతరాంధ్రులు అనడం మనవాళ్లు యింకా ఎప్పటికి నేర్చుకుంటారో అనేవారు. 'ప్రవాసి' అనే పేరుతో జమ్‌షెడ్పూర్ నుంచి వెనుకొక పత్రిక వచ్చేది - యిప్పుడు వస్తోందో లేదో తెలీదు. కలకత్తాలో గాని, ఢిల్లీలోగాని, బొంబయిలోగాని వున్న ఆంధ్రులు ప్రవాసు లెంత మాత్రం కాదు ; రాష్ట్రేతరాంధ్రులు.

కొన్ని శబ్దాలు భాషలోకి చొరబడి ఒక పక్షాన వదలవు.

కలకత్తా రావాలనీ, ఈ వంగ భూమి దర్శించాలనీ, గురుదేవుని శాంతినికేతన్ విశ్వభారతీలు చూడా లనీ ఎంతో కాలంగా మా స్వప్నం. రెండు నెలల క్రితం, మొన్న జన వరిలో, శివస్వామీ దంపతుల ప్రేమా నురాగాలవల్ల, ఆ కోరిక తీరడమేగాక, సుందర్‌బన్స్ వీక్షించగల అపూర్వా వకాశం కూడా లభించింది.

బెంగాల్‌కీ ఆంధ్రాకీ మొదటినుంచీ గాఢమైత్రీ లత అల్లుకుపోయింది. సంస్కరణోద్యమం, రాజకీయ సంచ లనం, సాహితీ వికాసం యిక్కడ తల ఎత్తి తెలుగు సీమలోకి పాకేవి. దేవుల పల్లి కృష్ణశాస్త్రిగారి 'ఊర్వశి' గురు దేవ్ టాగూర్ ఆశీస్సు పొందింది - స్వయంగా చదివి విశ్వకవికి చదివి వినిపించారటాయన. తెలుగు వారికి శరత్ - శరశ్చంద్రఛటర్జీ లేక ఛటో పాధ్యాయ - తమ రచయిత - బెంగాలీ అనుకోరు. పద్మభూషణ్ అక్కినేని నాగేశ్వరరావుని మహానటునిగా చేసి నది శరత్ రచన 'దేవదాసు'. రెండవ ప్రపంచ యుద్ధకాలంలో కలకత్తాలో ఏర్పడిన అతిదారుణమైనకరువు,భవానీ భట్టాచార్య 'So Many Hungers' ద్వారా బయటవారికి తెలిసింది.

'ఇవ్వాళ బెంగాల్ అనుకున్నది — రేపు ఇండియా అనుసరిస్తుంది' అనేది పాత మాట అయినప్పటికీ, అందులో కొంత నిజం. యిప్పటికీ లేకపోలేదు. అధిక జనసంకీర్ణతగల పట్నమైనప్ప టికి ఈ మహానగర్ కొన్ని సాంస్కృ తిక విలువలని అతి పదిలంగా కాపాడుతోంది. జాతీయ వారసత్వ మెప్పుడూ కళల ద్వారా వ్యక్తమవు తుంది - ఆ కళల పరిరక్షణలో రాజకీయ వాసనలు లేవు. సాహిత్యం, సంగీతం, చిత్రలేఖనం, రంగస్థలం - యిలాటివే అక్కడి ప్రజల కళాభి రుచిని తెలుపుతాయి. 'రవీంద్ర సంగీత్' అందుకొక ఉదాహరణ. కలకత్తా న్యూథియేటర్స్ వారు 150 పిక్చర్లు తీశారట - అందులో ఒక్కటి కూడా సెన్సార్ కట్‌కి లోను కాలే దంటే,క శాత్మక విలువలపట్ల గల గౌరవమే కదా !

మీలో ఎందరికి బెంగాలీ, చదవ డం వ్రాయడం వచ్చునో నాకు తెలీదు. వారి భాష నేర్చుకు, మన భాష నేర్పడం ద్వారానే భాషామైత్రి ఏర్పడుతుంది. వేంకట పార్వతీశ్వర కవులు బెంగాలీ నేర్చుకు, బంకిమ్ చంద్ రచనలు తెలుగులో వ్రాశారు. ఆ విధంగానే వేలూరి శివరామశాస్త్రి గారు 'రాముని బుద్ధిమంతనం', 'తీరని కోరికలు' వంటి శరత్ నవలలు తెలుగులోకి తెచ్చారు. ఒకనాటి 'భారతి' సంపాదకులు గన్నవరపు సుబ్బరామయ్యగారు, 'శివశంకర పిళ్లై' నవలని మళయాళం నుంచి తెలుగు చేశారు. మొన్నీ మధ్య, అంటే పది రోజుల క్రితం, ఈ కలకత్తా నుంచి 'సురజిద్ ఘోష్' అనే సాహితీవేత్త - 'ప్రేమ్' అనే బెంగాలి లిటరరీ క్వార్టర్లీ ఎడిటర్ - మద్రాసు వచ్చారు. కేంద్ర

సాహిత్య అకాడమీ ఆఫీసులో కలుసుకున్నప్పుడు ఆయన అన్నారు: 'మనకు జర్మన్‌లోను, ఫ్రెంచిలోను, ఆఫ్రికా ఖండంలోను వచ్చే పుస్తకాలు తెలుసు - కాని, ఇరుగు పొరుగు భాషలలోని సాహిత్యం తెలియదు; సాహితీ పరుల పేర్లు కూడా వినివుండము' - అన్నారు.

ఇదంతా ఎందుకు చెబుతున్నానంటే, రాష్ట్రేతరాంధ్రులు తాము నివశిస్తున్న ప్రాంతంలోని భాషను నేర్చుకోవడం ద్వారా, ఆ భాషలో తమకు నచ్చినవి, తెలుగువారికి చెప్పడం ద్వారా, తెలుగు భాషని సుసంపన్నం చేయడమే గాక, భాషా సఖ్యత ద్వారా, జాతీయ సమైక్యతకు, దేశ సమగ్రతకు తోడ్పడిన వారవుతారు.... 'దేశాభిమానం నాకు కద్దని - వొట్టి గొప్పలు చెప్పుకోకోయ్ - పూని యేదైనాను వొక మేల్ - గూర్చి జనులకు చూపవోయ్' - ఎనభై తొంభై ఏళ్ల క్రితం ఆ మాటలు ఎవరన్నారో నేను చెప్పక్కర్లేదు - మీకు తెలుసు.... వోపికగా విన్న మీ అందరికీ కృతజ్ఞతాభివందనములతో సెలవు తీసుకుంటున్నాను.

—యన్నార్ చందూర్









జెమిని పళ్ళపొడి

జెమిని కెమికల్ ప్రొడక్ట్స్ (ఫర్మ్) పోస్ట్ బాక్స్ నం 7,
మచిలీపట్నం-521 001. ఆంధ్ర (ఇండియా)

పళ్ళకు తెలుపుదనం – చిగుళ్ళకు గట్టిదనం.

# కొత్త పుస్తకాలు

కుమ్మరి మొల్ల - సినిమా నవల. రచన: డా॥ ఇంటూరి వెంకటేశ్వర రావు. ప్రతులకు: వెంకట మైత్రేయి కళామందిరం, 4, గంగెయమ్మన్ కోయిల్ వీధి, మద్రాసు - 600 024 .... నాలుగవ ముద్రణ.... వెల రు. 30-00.

దేవుణ్ణే వివాహం చేసుకుంటాననే సంకల్పం, ఆ వాంఛ సఫలం కావడం, పెరియాళ్వార్ అభిమాన పుత్రిక ఆండాళ్ కథను స్మరింప జేస్తుంది - అని రాజమన్నార్; ఈ నవలను ఆధారంగా చేసుకొని శ్రీ సుంకర సత్యనారాయణగారు వ్రాసిన బుర్రకథ ఎన్నో దళాలచేత చెప్పబడి, అశేష ప్రజానీకపు మన్నలందుకున్నది - అని చిత్తూరు నాగయ్య; అనుంగు బిడ్డ 'కుమ్మరి మొల్ల' కృతికన్యను కృతజ్ఞతతో స్వీకరిస్తున్నానని మూడవ ముద్రణ అందుకున్న అక్కినేని నాగేశ్వరరావు - ఇంటూరి వారి సారస్వత కృషిని అభినందించారు. దుక్కిపాటి మధుసూదనరావు, డివియస్ రాజు, చివియస్సెస్ మణి ఈ పుస్తక ప్రచురణలో ఆర్థికంగా సాయపడ్డారు. అర్జునరావు డాక్టరు ఇంటూరి సంక్షిప్త జీవిత చరిత్ర వ్రాశారు.

'మొల్ల'ను వెండితెర కెక్కించడానికి యల్వీ ప్రసాద్, డియల్ నారాయణ వెనకాడారు. పద్మనాభం సాహసంతో ముందంజవేసి, వాణిశ్రీ, గుమ్మడి, నాగభూషణం, అల్లు రామలింగయ్య, సత్యనారాయణ మున్నగు వారితో 'కథానాయిక మొల్ల' నిర్మించగా, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వపు 'సువర్ణనంది' అందుకున్నది ఆ చిత్రం. ఇంటూరివారు తమ రచనని సినిమా నవల అన్నారు గనక యిందులో కనిపించే సినిమా లక్షణాలకు మనం ఆశ్చర్యపోనక్కరలేదు.

గోపవరం అగ్రహారంలో శ్రీరామనవమి రోజున, రంగనాయకి స్వామి వారి ముందు నాట్యం చేస్తూన్నప్పుడు, అఖండ జ్యోతి ఆరిపోగా, కేసన కూతురు గర్భగుడిలో ప్రవేశించి ఆ జ్యోతి వెలిగిస్తుంది; దేవునికి అపచారం జరక్కుండా అడ్డుపడుతుంది. కాని ఊరు పెద్దల ఆగ్రహావేశులవుతారు. శ్రీకంఠమల్లేశుని మీద శతకం రాసిన కుమ్మరి కేసన కూతురీమె.

ఒక కోయ యువకునితో మొల్లకు స్నేహమవుతుంది. దేవుణ్ణి చూడాలనీ తెలుసుకోవాలనీ ఆరాటపడే మొల్లకు, పరిపక్వత, పరిపూర్ణత్వం కలిగించిన ఆ కోయ యువకుడు, తల్లి, తండ్రి, గురువు, పరాశక్తి - నలుగురు దేవుళ్లనీ, ప్రణయోన్మాదమూ ప్రేమ తత్త్వమూ అధిగమించి, తండ్రికి శుశ్రూష చేయమనీ, వనభూముల నుంచి ప్రజల మధ్యకి పంపుతాడు. భక్తి జ్ఞానాలు పొందిన మొల్ల, తెనాలి రామలింగనితో వాగ్వాదం పెట్టుకు, ఆయన అయిదేళ్లు గడువీయగా, ఈమె అయిదు రోజులలో రామమందిరంలో కూచుని, రామాయణం వ్రాసి, రామ చంద్ర ప్రభువులో ఐక్యమవుతుంది. నేటి సామాజిక సమస్యలని, ఆనాటి వాతావరణంలో ప్రవేశబెట్టి చెప్పిన సినిమాకథ యిది.

'తేనె సోక నోరు తీయన యగు రీతి, తోడ నర్థ మెల్ల తోచునట్లు' - రామాయణం చెప్పిన మొల్ల ఎవరు? కవిత్వం ఆమెకు ఎలా అబ్బింది? బ్రాహ్మణకన్యా? కుమ్మరి కులంలోని 'గురులింగ జంగమార్చకుడు' అతుకూరి కేసన స్వంత కూతురా, పెంపుడు కూతురా? శ్రీకృష్ణ దేవరాయని వుంపుడు కత్తెయా? వితంతువా? విరాగిణియా? రసికత నెరిగిన దేవదాసియా? ఈ ప్రశ్నలకు సమాధానం జెప్పగల చారిత్రకాధారాలేమీలేవు. పదిమందికీ అర్థమయే స్వచ్ఛమైన భాషలో, తేట తెనుగులో రామకథ చెప్పిన పుణ్యాత్మురాలు. 'రాజిత కీర్తియైన రఘురాము చరిత్రము మున్ గవీశ్వరుల్ - తేజ మెలర్ప జెప్పిరని తెల్పియు గ్రమ్మఱ జెప్పనేల నన్ - భూజన కల్పకం బగుచు భుక్తికి, ముక్తికి మూలమైన యా - రాజును దైవమైన రఘురాము నుతించిన దప్పు గల్గునే' - అన్న మొల్ల కథను, ఇంటూరి వారు సినీ సరళిలో చక్కగా చెప్పారు.

—క్షీరసాగరమ్

'మా మంచి మాస్టారు' (నవల) రచన : డా॥ కె. రవీంద్రబాబు. ప్రచురణ : నవజ్యోతి పబ్లికేషన్స్, ఏలూరు రోడ్డు, విజయవాడ - 520 002.... వెల : రు. 20-00.

'మా మంచి మాస్టారు' నవల 'ఆంధ్ర జ్యోతి' వారపత్రికలో ధారావాహికంగా వెలువడింది. ఈ నవలలోని 'మా మంచి మాస్టారు' రాజారావుగారు. ఆయన ఉపాధ్యాయునిగా ఎక్కడకు వెళ్ళినా అక్కడే తన వృత్తికి అంకితమైపోయి విద్యార్థులను తీర్చిదిద్దడానికి ఎన్నోకష్టాలను ఎదుర్కొంటారు.

"జిల్లా మొత్తంలో ఏది మరీ పనికి మాలిన స్కూలైతే, నన్నక్కడ వేయండి. కొంత కాలం పాటు నన్నక్కడ పని చేయనివ్వండి. అయితే, నాకు ఫ్రీహాండ్, యిచ్చి, అన్నివిధాల

నాతో సహకరించండి. స్కూలును రాష్ట్రంలో మొదటి స్కూలుగా తీర్చి దిద్దుతానోలేదో చూడండి" అని ఆత్మ విశ్వాసంతో చెప్పగలిగిన రాజారావు లాటి మాస్టారులు ఎక్కడోగానీ తారసపడరు.

విద్యార్థులంతా తన పిల్లలుగా వారిలో ఎవరూ చదువుకు అనర్హులు కాదని భావించి, వారిని పైకితేవడానికి అహర్నిశలు శ్రమపడ్డ దక్షిణామూర్తి గారి వద్ద చదువుకొని, తన గురువు గారు అమలుపర్చాలన్న పథకాలను, ఆయన తదనంతరం అమలు పర్చుతూ, ఆమాటే ఎంతో వినయంగా చెప్పుకోగలిగిన ధీశాలి రాజారావు మాస్టారు.

మెహజిత్, మనీషితలు చదువు కోవాలన్న కాంక్షలో పడిన కష్టాలు, మనసును కలచి వేస్తాయి.

జ్యోత్స్నానాథ్‌లు, వాసుకిలు - ప్రతి స్కూల్లోను వుంటారు. కానీ, తను చేపట్టిన ఉపాధ్యాయ వృత్తిని చిత్తశుద్ధితో, కష్టపడి పనిచేసి అందరి మనసులను దూరగొన్న రాజారావు గారి లాటి మాస్టారులు, స్కూలు కొకరైనా వుంటే.... 'ఆహా....' అని .... నవల చదివాక.... అనుకుం టుంది పాఠకుని మనసు.

—అన్నపూర్ణా రెడ్డి

# వసంత విలాసం

ప్రతి యిందు కిరణం
తెలి మబ్బు శకలం
చిరు గాలి కెరటం
ఒక వసంత సందేశం

తళుకు లీను తారలు
మినుకు మనే మిణుగురు
చిలిపి పిట్టల పాటలు
పలుకు వసంత గానాలు

కనులు తెరచిన మల్లిక
మత్తు జల్లు మాలతి
హసన ముఖి పద్మిని
పంచేరు పరిమళ వసంతం

గడ్డి పోచలకు ముక్తాహారం
ఎండు మోడు కొక కెంపుల పేరు
ఎద ఎదలో కవితా భరణం
ఇదంతా వసంత ప్రమోదం

గుండె తంత్రులు మీటినా
స్మృతుల పొరలు కదిలినా
హృది మృదువుగ పాడినా
అది మధు మానపు విలాసం.

చీకటి తెరలు చీల్చాలని
నవలోకపు తలుపులు తెరవాలని
యువత పడే ఆరాటం
అదే అసలు వసంత ఆగమనం

వెలితి లేక మనసులు
లేమి లేని మనుష్యులు
విశ్వమంత శాంతి వాకలు
నిజంగా అది వసంత శుభోదయం.

—సరోజినీ ప్రేమ్‌చంద్

సంక్షిప్త భాగాలు

# 'నా రాట్నచక్రం'

## తల్లాప్రగడ ప్రకాశరాయుడు

గాంధీ గారికి సత్యాగ్రహోద్యమం, నిర్మాణ కార్యక్రమం రెండు నేత్రాల వంటివి ; రెండూ పరస్పర ఆశ్రితాలు. రాజకీయ పదవులు ఆశించకుండా, గాంధీజమ్‌కి కట్టుబడి, నిర్మాణ కార్యక్రమానికి అంకితమైన మహానుభావులలో తల్లాప్రగడ ప్రకాశరాయుడు గారొకరు.... వారి జీవిత గాథలోని సంక్షిప్త భాగాలివి.

మేము కొందరం శవంతో వెళ్ళి పని పూర్తి చేసుకొని రావటానికి కూడ అంగీకరించాడు. ఇంత మంచితనం జైళ్ళలో నేనెక్కడా చూడలేదు. దీనికి దైవకృప అని నేను పేరు పెట్టాను. ఖైదీ లందరూ విడుదలైన రోజున (అది గాంధీ ఇర్విన్ పేక్ట్ వల్ల జరిగిన పని) గ్రీన్‌వుడ్‌ను మా మధ్యకు వచ్చి నిలువమని కోరాం. అంతకు పూర్వం political ఖైదీలు అతణ్ణి చూచి చాలా నెలలయింది. సంతోషంతో వచ్చి కొన్ని వందలమంది నిలుచున్న పెద్ద circle మధ్య నిలబడ్డాడు. అతడు మా పట్ల చూపిన మంచితనాన్ని ఉగ్గడిస్తూ ఇద్దరు ముగ్గురం మాట్లాడినాము. అంత సేపూ నేనతని ముఖం వంక చూస్తూనే ఉంటిని. మా మాటలకు అతడేమీ జవాబు చెప్పలేదు కాని మౌనంగా నిలబడ్డాడు. మాకంతేచాలు ననుకొన్నాను. మా మీద పెట్టబడిన కఠిన నేరాల సెక్షనులను బట్టి ముగ్గురు నలుగురను తప్ప ఆ నాడు అందరినీ విడుదల చేసి మమ్మల్ని మట్టుకు బళ్ళారి central jail కు పంపి తరువాత మమ్ము కూడ విడుదల చేశారు.... మా విడుదల అయినప్పుడే మధ్యదారిలో తెనాలి కండ్ల డాక్టరు వెంపటి సూర్యనారాయణ గారితో నాకు పరిచయమయింది.

ఆనాటి బళ్ళారి సెంట్రల్ జైలు సూపరెంటు శ్రీ షంకర్. అతడు కన్ననూరు జైలు నుండి బదిలీ అయి బళ్ళారికి వచ్చాడు. అతడు కన్ననూరులో నుండగా ఒక సంఘటన : నే నెరిగిన

బ్రహ్మదేవశాస్త్రి అనే వాడుండేవాడు. విడుదలై ఈ శాస్త్రి రాజమండ్రికి వచ్చి గొప్పకోసం నాకొక కథ విని పించాడు. సూపరెంటు షంకర్ ఎంత సజ్జనుడో ఈ కథ వల్ల తెలుస్తుంది. శ్రీ షంకర్ అన్నాడట తన ఖైదీలతో: 'నేను మీకేమీ లోటు చెయ్యను. అదిగో జైలుతోట, ఇదిగో కావలసి నంత నీరు. వంగ మొదలైన కూర గాయల పాదులకు నీరు పోసి తోటను పెంచుకోండి. మీకు రాట్నాలు కావ లిస్తే అవి కూడ కొన్ని సప్లయి చేస్తాను. వంతుల ప్రకారం నూలు వడకండి' అని. ఇంటికి వచ్చి నాతో బ్రహ్మదేవశాస్త్రి అనిన ఒక మాట: 'నీవు మాకు రాట్నాలిచ్చేవాడవు, మేము వడికే వాళ్ళమునా? మేము వడకం పో, పొమ్మన్నాము,' అని. శాస్త్రి జీవితంలో అసలు రాట్నం దృష్టి ఉండియుండదు. సత్యాగ్రహ మంటే జైలులో పడితే చాలునని చాలామంది నిఘంటువు. సూత్ర యజ్ఞం అక్కర్లేని వాడు గాంధీమనిషి కాడని నా నిఘంటువు. రాట్నం ప్రధానంగా నిర్మాణ కార్యక్రమంలోని 18 సూత్రాల ప్రాతిపదికయే. అదియే నిజమైన ఇండియా పూర్ణస్వాతంత్ర్య సాధనమని గాంధీ వేయి సార్లు చెప్పాడు. ప్రమాణ పూర్వకమైన ఇంటింటి భక్తి శ్రద్ధల సూత్ర యజ్ఞమే స్వాతంత్ర్యమన్నాడు. భారత ప్రజల చేతి రాట్నాన్ని హరింప జేసి ఇంగ్లాండు ఇండియాను బానిసను చేసింది. ఇండియా వస్త్ర పరిశ్రమను బ్రిటిషర్లు బలాత్కారంగా మాంచెస్ట రుకు ఎత్తుకొని పోవడాన్ని 'The saddest chapter in British Indian history' అన్నాడు గాంధి. 'ఇన్నాళ్ళు మమ్మిడిసి ఎక్కడ పోయావే' అని శ్రీ గరిమెళ్లపాటలో ఒక స్త్రీ అడుగుతుంది రాట్నాన్ని. 'చీకూటడవులలోన చేరిపోయానే' అని రాట్నం జవాబు.... ఆంధ్రరాష్ట్రం లోని ఖద్దరు పని అంతా శ్రీ భోగ రాజు పట్టాభి సీతారామయ్యగారికి అప్పగించాడు గాంధీ. గాంధీ ఆజ్ఞాను సారం అదే తన కార్య సర్వస్వంగా పరిగ్రహించి పని చేశాడు శ్రీ పట్టాభి. గొట్టిపాటి బ్రహ్మయ్యగారు (ఘంట సాల) ఈ విషయంలో పట్టాభిగారికి నమ్మిన బంటుగా పని చేశాడు. ఆ రోజుల్లో శ్రీ పట్టాభిగారు ఎక్కడ పర్య టించినా పెట్టి - రాట్నం ఆయన చేతిలో ఉండేది. జవహర్ లాల్‌కు అది 'livery of freedom' మాత్రమే అయింది. 'ఆంధ్ర కేసరి' చేతిలో నే నెప్పుడూ చర్ఖా చూడలేదు కాని, స్వరాజ్యం వచ్చే ముందు ఆయన మద్రాసు ఆంధ్ర సంయుక్తరాష్ట్ర ముఖ్య మంత్రిగా ప్రారంభించిన, ముఖ్యంగా ఖాదీ నిర్మాణ కార్యక్రమ ప్రణాళిక దేశానికొక అపూర్వ భిక్ష పెట్టింది. P.C.C. సొసైటీ స్థాపన, మర కదుళ్ళ (బట్టల మిల్లుల) నిరా కరణ, barn పొగాకు తిరస్కృతి – ఈ మూడు సంస్కరణలను సహించ లేక, ఆయన రాష్ట్ర మంత్రిత్వాన్ని ఎగర గొట్టేశారు. చెన్నపట్నాన్ని

న్యాయంగా ఆంధ్రరాష్ట్రంలో చేర్చాలని బ్రహ్మ ప్రయత్నం చేశారు ఆంధ్ర కేసరి, బులుసు సాంబమూర్తిగార్లు.

గాంధీ, వినోబాల దృష్టిలో రాట్నానికి, బేసిక్ విద్యకు అవినాభావ సంబంధముంది. నూలు వడికే 'తకిలీ' మీద వినోబా ఒక పుస్తకమే రాశాడు. రాట్నం మీద నూలు వడికేటంత వడిగా శ్రీ వినోబా తకిలీ మీద నూలు తీసేవాడు. తకిలీ పనిలో వినోబా సవ్యసాచి. రెండు చేతులా సరిసమానంగా తకిలీ ఆయన చేతిలో పని చేసేది. గాంధీ ఒకసారి వినోబాకు జాబు వ్రాస్తూ 'కృతయుగ వినోబా అని అతణ్ణి సంబోధిస్తాడు. ఆ విశే ణం వినోబాకే గాక ఇరువురిపట్ల ఎం apt గా సరిపోతుందో చూడండి Modern Science మానవ జీవిత నికి ఉపకారి కాదని నే ననను. కాని Science జన్మగౌరవం ఆధ్యాత్మి సాధనతో కలిసే ఉండాలి. ప్రకృతి పరిశోధనకు ఆత్మజ్ఞానం ప్రాతిపదికగా ఉండాలి. సైన్సు ఏవేవో పరిశోధనలు చేసి ఎక్కడి దక్కడే విడిచి వేస్తుంది. ఆధ్యాత్మిక శాస్త్రం ప్రకృ తిలో 'పురుషుణ్ణి' దర్శిస్తుంది. బుద్ధి




అందం చిందే సుకుమార చర్మమునకు ఎల్లప్పుడూ వాడండి.
అశోకా
శాండల్ వుడ్ టాల్కం పౌడర్లు
'ASOKA'
ALL PURPOSE
SANDAL WOOD
Powder
'ASOKA'
Sandalwood
TALCUM POWDER
ASOKA
Sandalwood
FACE POWDER
బ్రిలియన్‌టయిన్
సల్లని కురులకు
చల్లదనమునకు
తప్పక వాడండి




లేని ప్రకృతి పరిశోధన ప్రాణం తీసే అణ్వస్త్ర రాక్షసి కోసం వెదుకులాడుతుంది. ఆత్మజ్ఞానంతో ప్రకృతిని పరిశోధించిన వారే మన మహర్షులు, వారి సంతతి వాడే నిన్న మొన్నటి మన జగదీశ చంద్రబోసు.... మధ్య నొకమాట: రాట్నం పునరవతరణ కోసమే గాంధీ జన్మించాడు. ఇప్పుడు ఇండియా పొలిటీషియన్లు అనుభవిస్తూన్న 'స్వరాజ్యం' కోసం గాంధీ పుట్టలేదు. గాంధీని ఉపయోగించుకొని పొలిటీషియన్లు ఈ రాజ్యాన్ని సంపాదించారు. నిజానికి గాంధీ తలచిన దేశస్వాతంత్ర్యం ఇప్పటికిని రానే లేదు. ప్రస్తుత ఇండియా సర్కార్లు చేస్తున్న ఘనకార్యం రాజకీయపార్టీ దొమ్ములాటలే. బ్రిటిషు వాడు రాట్నాన్ని చంపివేస్తే, వీళ్ళు గాంధీ సిద్ధాంతాన్ని చంపివేశారు - ఒక సారికాదు పదిసార్లు!

రాట్నాన్ని దేశంలో ప్రతి ఇంటను, ప్రతి కుటీరంలోను ప్రతిష్టించి సూత్రయజ్ఞాన్ని ప్రతి గృహిణికి అలవర్చటానికి ప్రయత్నం చేయమనటమే 1947 నాటి అఖిల భారత చరఖా సంఘ తీర్మాన సారాంశం. జెండా మీద రాట్నచక్రాన్ని ఎందుకు తప్పించాలో తన కర్థం కాలేదని గాంధీయే చూచాయగా అన్నాడు. ఈ అనటం సాయంకాలపు ఒక ప్రార్థనానంతర ప్రసంగంలో జరిగింది. కానీ 'ఏదైతే నాకేమి?' అన్నట్లు ఆ నాటి ప్రభుత్వ పెద్దల అభిమతానికే వదిలేశాడు.

నా రాజమహేంద్రవర గాంధీ జాతీయ పాఠశాలాధ్యాపకత్వం నాటిదే మరొక చిన్న (మంచి) జ్ఞాపకం. రాజమహేంద్రవర నివాసం నుండి అప్పుడప్పుడు మేము ముగ్గురంకూడి గాంధీ సందేశాన్ని వినిపించటం కోసం జిల్లాలు తిరగటమే పనిగా పెట్టుకొన్నాం. ముగ్గురం ఎవరు? 1) ప్లీడరీ పాసయిన భమిడిపాటి సత్యనారాయణ. 2) అర్ధంతరంగా ట్రైనింగు కాలేజీ విడిచి వచ్చేసిన గరిమెళ్ళ సత్యనారాయణ కవి, 3) నేను. ఎక్కడి కక్కడ దొరికిన ఏదో ఇంత ఆహారం తింటూ పర్యటించే వాళ్ళం. కంఠం మొదలు పాదాల వరకు ఒకటే అంగరకా కొన్నాళ్ళు వేసుకొనేవాడు శ్రీ గరిమెళ్ళ. 1935-40 ల మధ్య నేను నిడదవోలులో ఉన్నప్పుడు మా ఇంటి ముందరి నుంచి శ్రీ కొండయ్యగారి 'కెమికల్స్' వైపుకు నడిచి వెళ్ళుతున్నాడు శ్రీ గరిమెళ్ళ. మేము చూచుకొని బహుకాలమయింది. ఆగంతుక పునర్దర్శనం! ఏదో లోకం నుండి ఆయనను నా కోసం పంపాడా దైవం అన్నట్లు పరమానందం పొందాను. ఎట నుండి, ఇట్లా ఎక్కడి కన్నాను. పూర్వపు తాళపు చిప్పలు చేతిలో లేవు, ఇత్తడి చెంబులేదు. కంటిచూపు చాల తగ్గిపోయింది. కంఠధ్వని కూడ అంతే. అయితేనేమి! పూర్వపు దివ్య స్మృతులెన్నో మనసుకు వచ్చి ఆయన ప్రస్తుతస్థితికి నాకు దుఃఖం వచ్చింది. గురుదేవునిగా తలచి ఆ కాలువగట్టున ఆయన పాదాల కొరిగాను. గాంధీ

ఉద్యమ దినాలే మేము నిజంగా బ్రతికి ఉండిన రోజులు. ఆయన భార్యా బిడ్డలు ఏమైనారో? ఒంటరిగా వచ్చాడు 'కొండయ్యగారు ఏమైనా సహాయం చేస్తారేమోనని ఇట్లా వచ్చాను. బ్రాహ్మడి కున్నదే కదా ఈ యాచన' (అంటే అధికారంతో అడిగి పుచ్చు కోడం) అని ఆయన అనేటప్పటికి నా దుఃఖం అధికమయింది. 'అవస్థా పూజ్యతే రామ' జ్ఞాపకం వచ్చింది. ఒక పూట నా ఇంటికి తీసుకొనివెళ్ళాను. పాత కథలన్నీ జ్ఞాపకం చేసుకొన్నాం. ఆయనది సహాయ నిరాకరణ పాటల పుస్తకం ఈ రోజున కూడ పాతబడి నా వద్ద నున్నది - 60 ఏండ్లనాటిది! అందులో ఉన్నదంతా సువర్ణ శిలాక్ష రాల జాతీయోద్యమ వేదం అది గాంధీ ధర్మయుగం. తోసుకొని వచ్చింది; మళ్లీ అంతట్లో అంతర్ధాన మయింది ఆ స్వర్ణయుగం.

## 5

గాంధీ 2వ Round Table Conference కు కాంగ్రెసు వారి ఏకైక ప్రతినిధిగా వెళ్ళి 'మీరిచ్చే స్వరాజ్యం మా కక్కరలేదు' అని ఇంగ్లాండు ప్రభుత్వానికి స్పష్ట పరచి స్వదేశానికి వచ్చేశాడు. అక్కడితో మరల నిర్బంధాలు (arrests) మొద లయ్యాయి. గాంధీ, అతనితో పాటు


జమ్మి వారి

# లివర్‌క్యూర్



పసిబిడ్డలకు యేర్పడు కామెర్లు (జాండీస్) ఆకలి లేమి, మలబద్ధకము, మలము తెల్లగా పోవుట, మూత్రము విసర్జించినచోట తెల్లగ మరక కట్టుట— మొదలైనవి లివరువ్యాధి సూచనలగును.

ఈ వ్యాధిని నిర్మూలించుటకు 'జమ్మి' వారి డాక్టరును సంప్రదించండి.

ప్రతినెలా వారి డాక్టరు మీ ఊళ్లకు వచ్చెదరు.

**జమ్మి ఫార్మస్యూటికల్స్**

'జమ్మి బిల్డింగ్స్'

**61, రాయపేట హైరోడ్డు, మద్రాసు - 600 004 - ఫోన్ నెం. 72539**

మరల అందరూ జైళ్ళలో పడుతున్నారు. ఈ మధ్య కాలంలో మేము ఊళ్ళ వెంట తిరిగి ఖద్దరు, స్వదేశ వస్తువులు అమ్ముతున్నాము. మరల ఆ పని తాత్కాలికంగా నిలిపివేసి శాసనోల్లంఘనోద్యమంలో దిగవలసిందే కదా! భీమవరం సమీపంలో సుబ్బతాత రాజుగారి 'వేంద్ర' గ్రామంలో రాత్రి భోజనం వేసి ఎవరి కంటబడకుండ చిన్న నావ మీద భీమవరం చేరుకున్నాం. Irwin వైస్రాయల్టీ అంతమై Lord Wellingdon ప్రభుత్వం వచ్చింది. ఉద్యమాన్ని అణచడానికి ఇర్విన్ చాలడని చెప్పి లార్డ్ వెల్లింగ్‌డన్‌ను ఇండియాకు పంపింది ఇంగ్లాండు సర్కారు. సత్యాగ్రహులందరిని చితక గొట్టడం ఈ సారి తప్పదు. అందువల్ల దెబ్బలకు అందరము సంసిద్ధులమయ్యాం. అయితే అందుకు మనుష్యులను పోగుచేయడం మాకు కొంత కష్టమయింది. గ్రామాధికార్ల, పోలీసుల కంటబడకుండ రాత్రులు ఊళ్ళు తిరిగి ఇరవై మందిని సమకూర్చాను. 18 మంది మగవాళ్ళు, ఇద్దరు స్త్రీలు. స్త్రీలలో ధీశాలి, ధైర్యశాలి అగు శ్రీమతి ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మ గారొకరు, సాయంకాలానికి ఎవరికి వారు సుబ్బతాత రాజు గారింట వేంద్రలో పోగుపడ్డాం. గట్టి మాగడ పెరుగుతో మా కాయన భోజనం పెట్టారు. ఆయనను గురించి ఒక్కటే మాట : ఆ జిల్లా సత్యాగ్రహి దళాలకు ముఖ్య నాయకుడాయన. కానీ, ఆ నాటి మా జట్టులో ఆయన రాలేదు. వేంద్ర కాలువలో నావనెక్కే ముందు మేము చేసుకొన్న దొక్కటే ప్రమాణం : పోలీసుల లాఠీ దెబ్బలకు ఎవ్వరూ పారిపోకూడదు. సొమ్మసిల్లిపోయేవరకూ ఎవ్వరూ నేలపై పడకూడదు. మే మెందర ముంటిమో మమ్మల్ని కొట్టటానికి మాపై బడ్డ పోలీసులు అంతకంటె ఎక్కువ ఉన్నారు. ఒక సబ్‌ఇన్స్పెక్టరు, ఒక పెద్ద ఇన్స్పెక్టరు. వాళ్ళు వచ్చి 'Will you disperse or not' అన్నారు. 'In Gods's name, we won't' అన్నాడు కస్తూరి సూర్యప్రకాశం. కఱ్ఱలతో చాలామందిని నలుమూలలకు బలిమిని తరిమివేశారు. స్త్రీలను మాత్రం కొట్టలేదు. స్త్రీలు నిలబడ్డారు. 'మమ్మల్ని కూడ కొట్టండి' అన్నది లక్ష్మీబాయమ్మగారు. చివరకు నన్నొక్కడినే పోలీసు స్టేషనుకు పట్టుకొని వెళ్ళారు. వెంటనే సర్కారు ఆసుపత్రికి తీసుకొనివెళ్ళారు. దెబ్బల రుచి బాగా చూడాలని చెప్పి ఆ రోజున నేను చొక్కా కూడ వేసుకొని రాలేదు. చిన్న కండువా మాత్రం పైన కప్పుకొన్నాను. ఎడమ చేతి ఎముక చిట్లింది. వంటి మీద తేలిన cane తట్లు సుమారు ఎనభై అని డాక్టరు లెక్కవేశాడు. కనికరంతో 'అబ్బా! ఎన్ని దెబ్బలు' అని విస్తుపోయినాడు. ఒళ్ళు మొద్దెక్కి నాకు బాధ అనిపించలేదు. తరిమి వేయబడ్డ సత్యాగ్రహులు తిరిగి ఆ చోటుకురా ప్రయత్నించారు. కానీ వారిని పోలీసు చేరనియ్యలేదు. భీమవరం ఆదివారం బజారులో జరిగిన

పని ఇది. ఇక్కడ ఒక్కమాట : నన్ను జిల్లా మునసబు కోర్టు ఆవరణ మీదుగా ఆసుపత్రికి నడుపుకొని పోతుండగా కోర్టు హాలునుండి ప్లీడరు జోశ్యుల అచ్యుత రామయ్యగారు బయటికి వచ్చి, నిర్ఘాంతపడి నిశ్శబ్దంగా కన్నీరు కార్చారు. ఆయనిది బహు జాలిగుండె. అప్పుడో, ఆ తరువాతనో నన్ను తీసుకొని వెళ్ళి డివిజనల్ మేజిస్ట్రేటు ముందు హాజరు పెట్టారు. అతడు నాకు రెండేండ్ల కఠిన జైలు శిక్ష విధించాడు. కోర్టులో కూర్చున్న ఒక ప్లీడరు శ్రీ భగన్నారాణగారు లేచి 'ఈయన ఘరానా మనిషి, పెద్ద క్లాసులో వేయదగును' అన్నాడు. 'Then, can he pay fine' అన్నాడు మేజిస్ట్రేటు. ఆ ప్రశ్నమీద నేను కల్పించుకొని 'నా కెప్పుడూ అచ్చివచ్చినది 'C' క్లాసే - పైక్లాసు నా కిష్టంలేదు. మీరు నాకు 'C' క్లాసే ఈయండి' అన్నాను.

మళ్ళీ ఏముంది ? మొదటి రాజమంద్రి Central Jail నివాసమే. అది దొంగల ముఠా అని పైన చెప్పాను. ముఖ్యంగా అక్కడి సూపరెంటు అప్సన్ దంపతులు జ్ఞాపకం వస్తున్నారు. ఆ జైలు regular visitor గా ఒక Retired Deputy Collector

---

## 'జగతి' చందా కూపను

2, కచేరి రోడు - పి.బి. 2922
మైలాపూరు - మద్రాసు-600 004

ఈ నెల నుంచి 24 సంచికలు పంపగోరుతూ రు. 50/-కు (ఏభై) బాంకు డ్రాఫ్ట్ లేదా పోస్టల్ ఆర్డరు లేదా మనియార్డరు రసీదు ఇందుతో జత పరిచినాను.

పేరు ..............................

అడ్రసు ..............................

..............................

..............................

తేదీ : సంతకం

---

ఉండేవాడు. పేరెందుకులేండి, దేశి రాజు పెదబాపయ్యగారికి పిల్లనిచ్చిన మామ ఆయన. కూతుర్ని భర్త వద్దకు పంపలేదు ఆ పెద్ద మనిషి! ఎందుకనగా పెదబాపయ్య బ్రహ్మ సమాజికుడు, జైలు విజిటర్ మిష మీద సెంట్రల్ జైలుకు వచ్చి, జైలు తోటలో పండిన కూరగాయల్ని రిక్షాలో నింపుకొని ఇంటికి వెళ్ళేవాడు ఈ కలెక్టరు... సూపరెంటు అప్సన్‌కు నాకు ఎప్పుడూ తాతా మనవడి వరసే. అల్లుడు - మామల మధ్య ఎంతో తేడా! అప్సన్‌కు మళ్ళీ నా మీద కోపం వచ్చి నన్ను కోయంబత్తూరు జైలుకు బదిలీ చేశాడు. నే నక్కడికి చేరగానే, ఇక్కడి జైలు సూపరెంటు ఎవరని వాకబు చేశాను. Mr. Green Wood బళ్ళారి కంటోన్మెంటు నుండి కోయంబత్తూరుకు వచ్చాడని వినగానే నాకెంతో సంతోషమయింది. ఆయన నన్ను సత్యాగ్రహ ఖైదీలతో కలిపివేశాడు. తనకు నమ్మకమైన పాత మనిషిగా చేసుకున్నాడు. అక్రమంగా అల్లరికోసం Hunger Strike చేస్తున్న Political Prisoner వాగంటి సుందర శివరావు వద్దకు సూపరెంటు నన్ను పంపించాడు. 'అతనికి నేనేం చేశాను ? ఆ Hunger Strike ఎందుకో తెలుసుకో' మన్నాడు సూపరెంటు. క్రొవ్విడి లింగరాజు గారిని వెంటదీసుకొని వెళ్ళి, సుందర శివరావు Hunger Strike యిద్దరం చెప్పి మాన్పించాము. 'ఈ పళాన నన్ను block కు పంపి, అన్నం ముద్ద తినమంటాడేమో, ఏరక్త గ్రహణో పట్టుకొని నన్ను బాధిస్తుంది. రెండు మూడు రోజులు ఆస్పత్రిలో పెట్టి పాలో, సగ్గుజావో యిప్పించమని సూపరెంటుతో చెప్పమని కోరాడు సుందర శివరావు. అతణ్ణి కొన్నిరోజులు ఆస్పత్రికి పంపాడు గ్రీన్‌విడ్ అట్లా చివర వరకూ, నా రెండేడ్లశిక్ష ముగిసే వరకూ. గ్రీన్‌విడ్ వద్దనే రమారమి 16 నెలలు ఉన్నాను. అతడు నా యెడల చూపిన సద్భావం మరుపురానిది.

## 6

నేను 1932 లో కోయంబత్తూరు జైలునుండి విడుదలయి వచ్చిన తరువాత 1947 వరకు, స్వస్థానం విడిచి ఎక్కడికినీ వెళ్లలేదు. నిడదవోలు ప్రక్కనున్న సమిశ్రగూడెం పొలాలలో మరి యిద్దరు మిత్రులతో కలిసి యిండ్లు కట్టుకొని స్థిరపడ్డాను. ఆ నివాసాలలో నాదొక అర యకరం స్థలం. ఇల్లు నిర్మాణం కోసం కొంచెం దొడ్డి, వాకిలి కిందను కాస్త స్థలం పోయినా, మిగత జాగా యావత్తు intensive cultivation కు, నాకు తనివి తీరేటట్లు ఉపయోగపడ్డది. రాజమహేంద్రవర గాంధీ జాతీయ విద్యాలయ 14 యకరాల దొడ్డిలోను, 'ఆనందనికేతన' హరిజనాశ్రమ యకరం భూమిలోను నాకు అలవడిన భూసేవాభిరుచి ఇక్కడి అర యకరంలో నన్ను తీర్చిదిద్దింది. 1921 నుండి ఈ రోజు వరకు నా నివాసాలలో (అద్దె యిండ్లు కూడ) కాస్త ఖాళీస్థలం దొరికితే చాలు, చదు

వుకో, వ్రాతకో, తిండికో ఇంట్లో కూర్చోడం కంటె, మొక్కలో పాదులో పెట్టి నీళ్ళుపోసి వాటిని పెంచుతూ వాటి మధ్య దొడ్డో కూర్చోడమే నా అభీష్టం. 1921 మొదలుగా గాంధీ దయ వల్ల నా చేతికి వచ్చిన రాట్నం పని, దొడ్లో వీలులేక, యింటిలోనే జరిగేది. చదువుల, డిగ్రీల ప్రపంచం లో నేను పడియుండకపోతే (తీరా చదువులు చదివి నేను చేసిన ప్రభుత్వోద్యోగాలూ లేవు) మా తండ్రి వలెనే కర్షకుడుగా బ్రతుకు సాగించి యుందు ననుకుంటాను.

అర్ధశతాబ్దానికి పూర్వం తెనాలి కండ్ల డాక్టరు వెంపటి సూర్యనారా యణగారితో నాకేర్పడిన పరిచయం కూడా ఆదర్శప్రాయమైనది. "సంసార విషవృక్షమునకు రెండు అమృతఫలం లంటాడు పంచతంత్రంలోని విష్ణు శర్మ. సజ్జన సంగతి యొకటి, సద్గ్రంథ పఠన మరొకటి." ఈ డాక్టరుగారి మైత్రిలో నాకు రెండూ లభించాయి. ఆ మైత్రి నేటివరకు అట్లాగే నిలిచి యుంది. ఆయన బాలయేండ్లయి యిక్కడ హైదరాబాదులో స్థిరపడి, వయస్సు 80 యేండ్లకు మించి యీ నాడు కూడ అన్నిరకాల కంటి ఆపరే షన్లు అవ్యాహతంగా చేస్తున్నారు. ఇదొక విశేషం. రోగులు ఆయన్ను వెదుక్కుంటూ కుప్పతిప్పలుగా వస్తుం టారు. గాంధీ వినోబాల అనుచరు డాయన.

జన్మతో పుట్టిన నాకర్షక (భూసేవ) స్వభావాన్ని గూర్చి చెప్పుకుంటూ ఈ యధ్యాయాన్ని మొదలు పెట్టాను. చిన్నప్పుడు తండ్రి చేసిన అలవాట్లను బట్టి యేమో అది నన్నిప్పటికిని వదల లేదు As I said before, it is an unworldly pleasure, as precious as life itself కొన్ని సంవత్సరాలకు పూర్వం యిక్కడి రేడియోలో నుండిన (యిపుడు స్వర్గీయ మహనీయ 'సహజానంద') 'మళ్లీ జీవిస్తే' అనే విషయం మీద హైదరాబాద్ రేడియో ప్రసంగం చేయ మన్నారు నన్ను. విషయం నా కర్థం కాక, అందలి భావమేమిటో తెలుప మని వారికి యుత్తరం వ్రాశాను. "ఏముంది - పునర్జన్మ నెత్తితే ఏం జేస్తారు?" అని దానికి యర్థమని బదులు వ్రాశారు. (ఈ ప్రసంగమే అంతకు పూర్వం రిటైర్డు రేడియో డైరక్టరు అయ్యగారి వీరభద్రరావు గారికి, యూనివర్సిటీ రిటైర్డు తెలుగు chief వెంకటావధాని గారికీ యీయ బడ్డట్లు నేను విన్నాను). నేను వారంత వాడను కాని నాకు స్ఫురించిన విధం గా 10, 12 చిన్నపుటలు వ్రాసుకొని రేడియో స్టేషన్‌కు వెళ్లి చదివాను. "నేను ఈ లోకం విడిచి వెళ్లిపోయే టప్పుడు, వీలైతే సుమండి కొన్ని ధాన్యపు విత్తనాలు, కొన్ని ప్రత్తి గింజలు వెంట దీసుకొనిపోయి, అక్కడ నాటి మరలి వస్తానని' నా ప్రసంగం లో ఒక కోరికగా వ్రాసుకున్నాను. నా శ్రమ వల్ల నలుగురికి అన్న వస్త్రాలు దొరకాలన్నదే ఉద్దేశం. నా శ్రమ భూసేవ రూపం దాల్చాలని నా రెండో

ఉద్దేశం. ఇదీ అసలు సంగతి! నా మాటలు సవ్యంగా వున్నాయా అని సహజానందగారిని అడిగాను - ప్రసంగమైన తరువాత. 'దానికేమి - బాగున్నదన్నా'రాయన. నేను తృప్తి నొందాను.

1933 నుండి 47 వరకూ యింటి చుట్టూ వుండిన అరయకరం స్థలంలో పొలం పని, సూత్ర యజ్ఞం, తేనెపట్ల పెంపకం - ముఖ్యంగా మూడే నేను పెట్టుకొన్న పనులని నా జ్ఞాపకం. మరేదీ జ్ఞాపకం రావడం లేదు. వస్తే, తరువాత వ్రాసుకుంటాను. ఒక్క కూలి మనిషిని పనిలో సహాయకుడుగా పెట్టుకొని, పని యంతా మేమిద్దరమే (కూలీ నేను) చేసుకునేవాళ్లం. 'బుడమ' (మెట్ట) వరి, రకరకాల ప్రత్తి, తొలకరి పైరు - రెండురకాల నువ్వు, బీర, పొట్ల, కాకర మున్నగు పాదులు, వాటికి పందిళ్లు, కొంత అరటి, కొంత భాగం గోగు, తోటకూరలు, బొప్పాయి, ఈ విధంగా, మధ్య మధ్య కాలిబాటలు తప్ప భూమి ఖాళీ పెట్టకుండా సద్వినియోగ పరిచాను. మరీ ఎండవేళ తప్ప యింటి నీడను కంటె పొలంలో పనిచేస్తూ కూర్చోవడమే నా కిష్టం, నా అభ్యాసం. అది మెట్ట ప్రదేశం కనుక స్థలానికి చేరియున్న పెద్ద కాలువ నుండి, రెండు చిన్న బిందెలు రెండు చేతులా పట్టుకొని, వర్షం కురుస్తున్నప్పుడు తప్ప, నేను మోసిన నీళ్ల బిందెల చేతిపరిశ్రమ నాకు శ్రమ యనిపించేదే కాదు. ఆ విధంగా 10, 12 ఏండ్లు అవలీలగా గడిచాయి. కాకినాడ కాలేజి హాస్టల్ చిన్నదొడ్లో సహాధ్యాయులుగా నేను, వెంకటాచలం ('చలం') వరుసగా మూడేండ్లు పని చేసినది (1911 to 13) యీ తోట పనియే. అయితే అది మా తిండి కుపయోగపడలేదు. ఉండబట్టక చేసుకున్న hobby.

1947 జనవరీలో మెరుపు తీగ వలె ఆకస్మికంగా వచ్చి నాపైబడ్డ ఒక వార్త. శ్రీ వీరేశలింగకవి సమాజ వార్షికోత్సవానికి కుముదవల్లికి వెళ్ళి తిరిగివస్తూ నిడదవోలు స్టేషన్‌లో దిగినాను. ఒక ఇంగ్లీషు Newspaper చేత బట్టుకొని శర్మ స్టేషన్‌లో నిలుచున్నాడు. రాష్ట్రంలో జిల్లాకొక్కొక్క Inspecting Assistant Textile Commissioner (I.A.T.C) ను నియమిస్తూ వేసిన మద్రాసు సంయుక్త రాష్ట్రప్రభుత్వ Order అందులో వుంది. ఆ జాబితాలో ప్రకాశరాయుడి పేరు కూడ ఉంది. 'ఇది నీవేనా ?' అన్నాడు శర్మ. "ఏమో, నాకు తెలియ" దన్నాను. సందేహం తీరడానికి రాష్ట్ర Textile Commissioner పరమేశ్వరన్‌కి ఉత్తరం వ్రాశాను.

(ఇంకా వుంది

గాంధేయ సమాజ సేవా సంస్థ (అవనిగడ్డ, 522 123) సౌజన్యంతో ....పుస్తకం వెల : రు. 20-00.



ఏప్రిల్ 04, 1992

'రాక్సీలో నార్మా షేరర్ - బ్రాడ్వేలో కాంచనమాల' (శ్రీశ్రీ) ఎటువంటి వేళ్లాలో తెలియని విద్యార్థి పరిస్థితివంటిదే ఈ ఉగాది రోజున. 'రాజా అన్నామలై'లో కళాసాగర్ వారి ఫంక్షన్ - మిత్రులు పట్టాభిరామ్ ఇంద్రజాల ప్రదర్శన; 'మినీ మ్యూజిక్'లో సాహిత్య అకాడమీ వారి 'మీట్ ది ఆదర్'లో నిస్సిమ్ ఎజికిల్ - 'ఇంప్రింట్' మాగజైన్ 'వివిధ పుస్తక' సమీక్షల ద్వారా సారస్వత పరంగా ఆప్తులు. ఎటువైపు మొగ్గి వుంటానో మీరు ఊహించుకో గలరు .. 'చేతులు ముడుచుకు కూచోవటం కంటె కట్టడం పనికి ఉపక్రమించడం మంచిది; మన శ్రమ ఎన్నటికీ వృధా కాదు' - అని నమ్మే ఈ సాహితీవేత్త జన్మతః యూదు వీరి కుటుంబం మహారాష్ట్ర జీవన విధానావలంబకులు - ఇంట్లో అందరికీ మరాటీ వచ్చు.

బొంబయి విల్సన్ కాలేజిలో ఎమ్.ఎ. (ఇంగ్లీషు లిటరేచర్) అయాక, లండన్‌లోని 'బర్క్‌బెక్'లో ఫిలాసఫీ చదివేందుకు వెళ్లారు ఎజికిల్. ఆ రోజు ల్లోనే పావర్టీ, ఫిలాసఫీ, పొయిట్రీ - ఈ మూడూ అనుభవంలోకి వచ్చా యట. 1952లో A Time to Change, లండన్‌లోని ఫార్చ్యూన్ ప్రెస్ నుంచి వెలువడింది - అదే సంవత్సరం డైసీ జాకబ్‌తో వివాహం. 1953లో రెండవ గేయ సంపుటి Sixty Poems వెలువడింది. జర్న లిజమ్, అడ్వర్టయిజింగ్, ఫాక్టరీ మేనేజి మెంట్ - యిలా వేరువేరు మార్గాలు తొక్కి చివరికి టీచింగ్‌లో స్థిరపడి, కవిత్వానికి, సాహిత్య విమర్శకు అంకితమయారు.

'స్వీయానుభూతి నుంచి, జీవన వాస్తవికత నుంచి ఎజికిల్ పొయిట్రీ పుట్టుకొస్తుంది. చుట్టూ పరిసరాలను ప్రేమిస్తూ, హృదయ స్పందనతో వాటిని పదాలలో పొదిగి ప్రాణం పోసే సృజనాత్మకత ఆయన కలంలో ఉండటం వల్లనే, ఆ గేయాలు, సజీవ రక్త మాంసాలు కలవిగా కనిపిస్తాయి. అగ్ని పుష్పాలు ఆ కవితా ప్రసూనాలు' - అంటారు అలహాబాదు యూనివర్సిటీ వైస్ ఛాన్సలర్ మాలిక్. స్త్రీ పడే

ప్రసవ వేదన వంటిది నిజాయితీ పరుడైన కవికి అనుభవైక వేద్యం - అంటారు ఎజికిల్.

"నేనిలా మద్రాసు వెళ్తున్నాను - సాహిత్య అకాడమీ వారి 'మీట్ ది అదర్' ప్రోగ్రామ్‌కి అని అనగానే, 'మీ గురించి మీరు చెప్పుకోవడానికి సిగ్గేయడం లేదూ?' అని అడిగింది శ్రీమతి. నిజమే! నా గురించి చెప్పుకొనేదేమీ లేదనీ, నా పొయిట్రీ గురించి మాట్లాడుతాననీ ఆమెకి విన్నవించుకున్నాను .... అన్ని హంగులూ గల నా జీవితానికీ, నా చుట్టూ వారి జీవితాలకి మధ్య కొన్ని యోజనాల దూరం వుంది.... కెనడాలో ఒకసారి నన్ను ఫ్లయిట్ ఎక్కించడానికి ఎయిర్‌పోర్ట్‌కి నా మిత్రుడు వచ్చాడు. బుకింగ్ వద్ద లేడీకి నా పేరు చెప్పాడు. 'ఇవ్వాళ ఛార్ట్‌లో ఆ పేరు లేదు. ఎక్కడో ఏదో పొరబాటు జరిగివుంటుంది' - అన్నదామె. మర్నాడు 'స్టేట్స్'లో నా లెక్చరు వుంది - 'వెళ్తితీరాలి - ఏం దారి?' అని మేమిద్దరం మథనపడుతూ, మధ్యని మరాఠీలో మాట్లాడుకోవటం విన్న ఆ యువతి 'మీరు మహారాష్ట్రీయనులా' అని అడిగింది. 'అవును' - అన్నాడు నా మిత్రుడు. 'అయితే, వుండండి' అని మూడు నిముషాలలో మాజిక్ చేసి, నా పేరు ఛార్టులోకి తెప్పించింది. మాతృభాషా బంధమది. అయితే, ఫ్లయిట్‌లో కూచుని, న్యూయార్క్‌లో దిగేదాకా, నా కారణంగా మరొక ప్రయాణీకుడు, తన సీటు కోల్పోయాడనే మనస్సంక్షోభం నన్ను విడనాడలేదు. జీవన సరళిలోని రాగ తాళ లయ గతులు అంత అనూహ్యంగా ఉంటాయి .... మూడు రోజులు కష్టబడి నలభై లైనుల పొయిట్రీ రాసి, రామానుజన్‌కి చదివి వినిపించాను. ఎంతో శ్రద్ధగా ఆలకించి 'అందులో అయిదున్నర లైనులు మాత్రమే బావున్నాయి; మిగతాది చింపెయ్' - అన్నాడు. మొదట్లో ప్రాణం కాస్త చివుక్కుమన్నా, అక్షరాలా ఆయన చెప్పినట్టు చేశాను .... విల్సన్ కాలేజీలో నేనింకా స్టూడెంట్‌గా వున్న రోజులలో, ఒక నాడు మా ప్రొఫెసర్‌తో 'వేస్ట్‌లాండ్' ప్రస్తావన ఎత్తేసరికి, 'టి యస్ ఎలియట్, డబ్లు హెచ్ ఆడెన్ కవులా? షేక్స్‌పియరూ మిల్టనూ చదవాలి గాని అలాటివి చదివి, నిష్కారణంగా చెడిపోకు' - అన్నాడు. నేను చెడిపోయానో బాగుపడ్డానో నాకు తెలీదు .... భావాంకురాలు ఎలా జనిస్తాయో ఎవరం చెప్పలేము. ఒక సారి, 28 ఏళ్ల నాటి స్మృతి చటుక్కున కళ్లముందు సాక్షాత్కరించి, ఆ అయిదు నిముషాలలో కవితా దుస్తులు ధరించింది.... చదవడం, రాయడం రైలు బద్దీల వంటివి. ఎక్కువ చదివి, తక్కువ రాయాలి. అందులో పరిపూర్ణత చేకూరిందనిపించే దాకా, ఎన్నిసార్లయినా చింపి రాయవచ్చు. మెరుగు పెట్టిన కొద్దీ కవిత్వం జిగేల్ మంటుంది.... యూదులు 70 దేశాలలో ఉన్నారు. నా పొయిట్రీ

'జ్యూయిష్' అనేవారు యిప్పటికీ తటస్థపడుతూంటారు. వాదించను. 'ఎత్నిసిటీ' జాతీయతలో ఒక భాగం .. మరాటీ నేను పోగొట్టుకున్న తల్లి ; ఇంగ్లీషు నా పెంపుడు తల్లి.. Night of the Scorpion గురించి చాలామంది చెబుతూంటారు. నా చిన్నప్పుడు మా అమ్మకు నిజంగా తేలు కుట్టింది. మంత్ర తంత్రాలు, నాటు మందులు, మంచి మందులు - అన్నీ వాడారు ఆమె పడవలసిన బాధ పడక తప్పలేదు - అంతటి బాధలోనూ ఆమె భగవంతునికి కృతజ్ఞత చెప్పుకుంది. నన్ను కుట్టి, నా పిల్లల జోలికి పోనందుకు, ప్రభూ, నీకు నా సాష్టాంగ దండ ప్రణామాలు - అంది .. ఆ సంఘటన జరిగిన యిరవై పాతికేళ్లకు ఆ రాత్రి జ్ఞాపకం కవితా చిత్రమయింది... ".

ఇలా ఎజికిల్, సుమారు గంటన్నర సేపు, కవిత్వాన్ని జీవితాన్ని జోడించి ఎంతో రసవత్తరంగా చెప్పారు. 1983లో కేంద్ర సాహిత్య అకాడమి అవార్డు పొందిన నిస్సిమ్ ఎజికిల్‌ని 1988 లో భారత ప్రభుత్వం 'పద్మశ్రీ' తో సత్కరించింది.

. . . . . 08

బుర్రా కామేశ్వర రావు, ఆయన సోదరి బుర్రా శాంతాదేవి తమ చివరి తమ్ముని కుమార్తె సౌ॥ శ్రీ పద్మావతికి, కృష్ణమూర్తి రావు దంపతుల కుమారుడు చి॥ శేఖర్‌కి, ఈ ఉదయం 7 గం॥ 15 ని॥ లకు, సైదాపేట పియస్‌డి కళ్యాణ మండపంలో శాస్త్రోక్తంగా వివాహం జరిపించారు.



భగవంతునికి, భక్తునికి, అనుసంధానమైనది!
అంబికా
AMBICA DURBAR BATHI
దర్బార్ బత్తి
MFRS:- అంబికా కెమికల్ ప్రొడక్ట్స్, ఏలూరు (A.P)



సాయంత్రం రిసెప్షన్‌కి వీలవదు గనక ఉదయమే వెళ్లి - ఆంధ్ర మహిళా సభ విద్యాలయం సెక్రటరీ సుశీలా దేవి, మైసూర్ ఫెర్టిలైజర్ అనసూయా వేణుగోపాల్, మేమూ వెళ్లి - వధూ వరులని శుభాక్షితలతో ఆశీర్వదించి వచ్చాము. రెండు కార్లెందుకని, మా కారు సుశీలగారింటి వద్ద వదిలేసి, అనసూయ కారులో వెళ్లాము.

నమ్మాళ్లార్ గారు మాకు ముప్ఫ య్యేళ్ల పాటు ఫామిలీ డాక్టరు - అయన యిప్పుడు లేరు. వారి అమ్మాయి 'వత్సల', శారదాంబ స్టూడెంట్ - చిల్డ్రన్స్ గార్డెన్ స్కూలు లో. వత్సలా రాజమన్నార్‌ల వివాహా నికి వెళ్లాము. ఇప్పుడు వారబ్బాయి చి॥ వినోద్‌కి, జయకరరావు దంపతుల కుమార్తె సౌ॥ సుజలతో వివాహం. నవ దంపతులు రెండు మూడు రోజు లలో స్టేట్స్‌కి వెళ్తున్నారు. ఉదయం ముహూర్తానికి వెళ్లడం కుదరలేదు గనక సాయంత్రం రిసెప్షన్‌కి. మిసెస్ నమ్మాళ్వార్, వత్సల, ప్రమీల, కోడలు జయ, మనుమరాలు ఊర్మిళ, అబ్బాయిలు, వారి భార్యలు, పిల్లలు అందరూ ఎంతో ప్రేమాస్పదంగా శారదాంబనీ, మాలతినీ చుట్టేశారు. ఆ అభిమానం, ఆప్యాయత, జ్ఞాపకాల సౌరభంలా వారి మాటలలో వ్యక్త మయింది.... నాలుగు రోజుల క్రితం ఎజికిల్ చెప్పినది జ్ఞాపకం వచ్చింది - బయట కనిపించే చెట్టుకీ, మనసులో మొలిచే చెట్టుకీ సమన్వయత ఏర్పరుచు కోవడమే జీవితమని .... వినోద్ సుజలల నవజీవన యాత్రకు మా హృదయ పూర్వక శుభాకాంక్షలు.

. . . . . 11

"ముప్ఫయేళ్ల 'కళారంజని' ఈ మధ్య అనుకున్నంతగా కార్యక్రమాలు వేయలేక పోతోంది. కారణం ఒక్కటే. అభిమానించే దాతలు (స్పాన్సర్స్) తక్కువవటం. ఈ '92'లో 'కళా రంజని'కి కొత్త ఊపిరి పోయగలమని ఆశిస్తున్నాము" - అన్నారు సెక్రటరీ పాండురంగ. ఈనాటి ప్రియా సిస్టర్స్ సంగీత కచ్చేరీని, స్వధర్మ స్వారాజ్య సంస్థ డైరక్టరు బివియస్సెస్ మణి స్పాన్సర్ చేశారు. ముఖ్య అతిధి ఓబుల్ రెడ్డి ఈ సంగీత శారదలని దీవించారు....

చిత్తూరు హైస్కూలు నుంచి రిటై రైన సుబ్బరామ్, పిల్లల సంగీత విద్యావకాశం కోసం, 1985లో మద్రాసుకి మకాం మార్చారు. ఈ ప్రియా ద్వయం 1989లో మైలా పూరు రసిక రంజని సభలో మొదటి ప్రోగ్రామ్ యిచ్చారు. (జగద్విఖ్యాతు రాలైన పద్మా సుబ్రహ్మణ్యం కూడా తన మొదటి ప్రోగ్రామ్ అక్కడే యిచ్చారు - ఆర్ ఆర్ సభకు గల అనువంశిక గౌరవం అనుపమానం). మొన్న డిసెంబరు సీజనులో ప్రియా సిస్టర్స్ ఎనిమిది చోట్ల ప్రోగ్రామ్‌లు యిచ్చారు. వారిని వెలుగులోకి తీసుకు రావడానికి భారత్ కల్చరల్ ఇంటిగ్రే షన్ కమిటీ, మద్రాసు తెలుగు అకా డమీ కొంతవరకు సాయపడ్డాయి....

ఎంత ముద్దో, ఎంత సొగసో, అను రాగము లేని మనసున సుజ్ఞానము రాదు - ఘనులైన అంతర్ జ్ఞానుల కెఱుకే గాని.... యిలాంటి త్యాగరాయ కీర్తనలతో, ప్రశంసనీయమగు విద్యా పాటవమూ, గాత్ర వైభవమూతో 'కళారంజని' సభ్యులని (రాణీ సీతై హాలులో) మెప్పించారు ప్రియా సిస్టర్స్....

'కళారంజని'కి వెళ్లడానికి ముందు థియొసాఫికల్ సొసైటీకి.... అయిదారేళ్ల క్రితం వార్ధాలో గాంధీగారి సేవాగ్రామ్, వినోబాజీ పౌనార్ ఆశ్రమం రెండూ చూశాము. అప్పట్లో పౌనార్‌లోనే కొంచెం చైతన్యం కనిపించింది; గౌతమ్ బజాజ్, అక్కడ తాము నిర్వహిస్తున్న కార్యక్రమాలు వివరించి చెప్పారు. పవిత్ర ఆశయాలకు అంకితమైన ఆదర్శ జీవి ఆయన. ఎప్పుడు మద్రాసు వచ్చినా, ముందుగా రాస్తూంటారు. రెండు మూడు గంటల సేపు ఆయనతో గడిపి, సజ్జన సాంగత్యమంటే ఏమిటో మనోగతాన తెలుసుకుంటాను.... థియొసాఫికల్ సొసైటీలో అచ్యుత్ పట్వర్ధన్ వద్ద వారం రోజుల పాటు వుంటానని రాసిన ఉత్తర రెండు రోజుల క్రితం వచ్చింది ... దివ్యజ్ఞాన సమాజం వారి ఆవరణలోకి ప్రవేశించగానే, ఒక అనిర్వచనీయానుభూతికి లోనవుతాము. ఆ వృక్షచ్ఛాయలో కరిగిపోయిన కథలెన్నో వున్నాయి; ఆ సువిశాల వాతావరణంలోని గాన స్రవంతికి నారికేళ వృక్షాలు తల


**మాలతీ చందూర్**

**నవలలు**

| | |
|---|---|
| వైశాఖి | 16-50 |
| కాంచనమృగం | 16-50 |
| భూమి పుత్రి | 16-00 |
| మధుర స్మృతులు | 14-00 |
| ఓ మనిషి కథ | 16-00 |
| ఏమిటీ జీవితాలు | 12-00 |
| మనసులోని మనసు | 25-00 |
| ఆలోచించు | 9-00 |
| రాగరక్తిమ | 18-00 |
| మేఘాల మేలిముసుగు | 16-00 |
| కలల వెలుగు | 15-00 |
| బ్రతకనేర్చిన జాణ | 14-00 |
| జయలక్ష్మి | 20-00 |
| కృష్ణవేణి | 20-00 |
| ఏది గమ్యం ఏది మార్గం | 15-00 |
| ఎన్ని మెట్లెక్కినా.... | 18-00 |
| సద్యోగం | 15-00 |
| లావణ్య | 14-00 |

**ఇవిగాక**

| | |
|---|---|
| వంటలు - పిండివంటలు | 48-00 |
| ప్రశ్నలు - జవాబులు | 15-00 |
| జాబులు - జవాబులు | 13-00 |
| అల్లికలు - కుట్లు | 30-00 |
| అందాలు - అలంకారాలు | 15-00 |
| మహిళలకు మధురజీవనం | 7-50 |
| దాంపత్య జీవితం | 12-50 |

**క్వాలిటీ పబ్లిషర్స్**

**విజయవాడ-2**

లూపుతూంటాయి. పచ్చదనానికి కరువువాచిన మనసు పరవశిస్తుంది - ఇది మద్రాసు కాదు, మరొక ఊరని పిస్తుంది. మెయిన్ గేటుకి, పట్వర్ధన్ బంగాళాకి గల దూరం కిలోమీటరుకి పైగా ఉంటుంది. సిమెంట్ రోడ్ — కాని, స్పీడ్ బ్రేకర్స్ చూసుకుంటూ వెళ్లాలి.... గౌతమ్ బజాజ్ అనుకోకుండా బెంగుళూరు వెళ్లవలసి వచ్చిందనీ, రెపటెల్లుండిలో రావచ్చుననీ చెప్పారు అచ్యుత్ పట్వర్ధన్. అంత దాకా వెళ్లి ఆ స్వాతంత్ర్య యోధునితో నాలుగు ముక్కలు మాట్లాడకుండా ఎలా రాగలను ? అదీగాక, ఆయన 'కమ్యూనికేటివ్ మూడ్' లో ఉన్నారు.

'క్విట్ ఇండియా ముమెంట్‌లో మీరు కూడా పాల్గొన్నారు కదా ?' - అని కదిపాను. 'అవును - అప్పట్లో నేనూ కాంగ్రెస్ వాదినే ! గాంధీగారు చాలా గొప్ప వ్యక్తి, మహాపురుషుడు, సత్యసంధుడు. తను నమ్మిన అహింసా సిద్ధాంతాన్ని త్రికరణ శుద్ధిగా ఆచరణలో పెట్టిన మహనీయుడు. అయితే, స్వాతంత్ర్య పోరాటంలోని తప్పటడుగు ఖిలాఫత్ ఉద్యమంతో ప్రారంభమయింది. తురుష్క సామ్రాజ్య పతనంతో, కాలీఫా పీఠం రద్దు కాగా, కెమాల్ పాషా నవ టర్కీని రూపొందించాడు. 'నేషన్-స్టేట్'గా టర్కీ నిలదొక్కుకుంటున్న రోజులలో, బ్రిటన్, ఫ్రాన్స్, అమెరికాలు మధ్య ప్రాచ్యాన్ని 'మాండేట్లు'గా తమ గుప్పెట్లో వుంచుకున్న తరుణంలో, ఈ కాలీఫా వ్యవస్థని పునరుద్ధరించాలనే గాంధీగారి వాదం, ముస్లిమ్‌లలోని మేధావి వర్గానికి ఆయన్ని దూరంచేసింది. ముల్లాలు, మత గురువుల చెప్పుచేతల లోని ప్రజలు, ఈ ఖిలాఫత్ ఉద్యమం వైపు మొగ్గు చూపారు. 'కాలిఫ్' అనే వ్యవస్థ లేకుండా చేయటం ముస్లిమ్ మతానికి అపచారంగా తలపోశారు గాంధీజీ. గాంధీ జిన్నాల వైరం అప్పట్లో అంకురించింది. జిన్నా కాంగ్రెస్ నుంచి విడిపోయి ముస్లిమ్ లీగ్‌లో చేరి, రాజకీయ ప్రత్యర్థిగా ముస్లిమ్ నాయకునిగా నిలదొక్కుకోవడంతో, చివరికి దేశ విభజన తప్పలేదు' - అన్నారాయన.

''మరి, అనిబిసెంట్‌కీ గాంధీగారికీ ఎందుకు పేచీ వచినట్లు ?' - అని అడిగాను.... 'అనిబిసెంట్ కూడా ఖిలాఫత్ ఉద్యమానికి వ్యతిరేకి. షౌకతాలీ, మహమ్మదాలీలని వెంటేసుకు గాంధీగారు తిరగడం ఆమెకి నచ్చలేదు. అంతేకాదు, శాసనోల్లంఘనం ప్రజలకు నేర్పడం మంచిది కాదని ఆమె అభిప్రాయం. ఎంతటి వారూ 'రూల్ ఆఫ్ ది లా'కి కట్టుబడి వుండాలి. నిరక్షరాస్యులైన ప్రజలకు చట్ట ప్రకారం నడచుకోవడం నేర్పాలి గాని ధిక్కరించడం నేర్పితే, ఈ ధిక్కారం ఎక్కడ ఆగుతుంది, ఎవరు ఆపగలరు ? - అని ఆమె ప్రశ్న. జిన్నా గాని, అనిబిసెంట్ గాని గాంధీజీ నిజాయితీని, సత్య వాక్పరి పాలనని, చిత్త శుద్ధిని ఏనాడు సంకించలేదు. అయితే, ఎవరి మార్గాన వారు నడి

వారు; గాంధీజీ వెంట దేశం నడిచింది, స్వాతంత్ర్యం వచ్చింది. కాని, గాంధీ గారనుకున్నట్టు ఏమీ జరగలేదు'' - అన్నారు అచ్యుత్ పట్వర్ధన్.

. . . . . 12

అఖిత భారత చిన్న పత్రికల మద్రాసు శాఖ సమావేశం ఆనందా కళ్యాణ మండపంలో మధ్యాహ్నం మూడు గంటలకు.... ఉత్సాహవంతులైన కార్యదర్శి యస్ రామదాస్, చిన్న పత్రికల నిర్వాహకులకు కంటక రహితమగు బాట ఏర్పరిచేందుకు ప్రయత్నిస్తున్నారు. ఎన్నో సమకూడాలి, ఎందరో కలసి రావాలి.... ప్రభుత్వ ప్రకటనల మాట ఎటున్నా, గ్రంధాలయాలు ఈ చిన్న పత్రికలను తమ లిస్టులో చేర్చి, కొనుగోలు చేయడం ద్వారా, చేయూత నిచ్చినట్లవుతుందని పలువురు సభ్యులు పేర్కొన్నారు.... తమిళనాడు శాఖకు విజిపి సంతోషం పాట్రన్. ప్రొఫెసర్ కలైమణి ప్రెసిడెంట్.

. . . . . 13

నాలుగు వందల చిత్రాలలో నటించి, నాలుగు పదుల సిని జీవితం గడిపి, సారస్వత లలిత కళారంగాలలో విఖ్యాతి నొంది, పంచకావ్య పఠనతో బాటు రవీంద్ర కవీంద్రుని బాట వెంట నడిచి, చిత్రలేఖకునిగా, కవిగా, ఉత్తమ కళాకారునిగా, సినీరంగం నుంచి లోక్ సభకు ఎన్నికైన ప్రథమ పార్లమెంటేరియన్‌గా, బహుముఖ ప్రతిభావంతునిగా, మానవతా ధర్మ నిరతునిగా, మంచి మిత్రునిగా ఎందరికో సన్నిహితులైన కళావాచస్పతి జగ్గయ్యకు, భారత ప్రభుత్వం 'పద్మభూషణ్' యిచ్చిన సందర్భంగా, పామ్‌గ్రోవ్ 'త్రిపురనేని గోపీచంద్' సభా ప్రాంగణంలో మోహన్‌బాబు, యార్లగడ్డ శంభుప్రసాద్‌తో బాటు, కెయస్ ప్రకాశరావు, డివియస్ రాజు, గుమ్మడి వెంకటేశ్వరావు, పప్పు వేణుగోపాలరావు, పరుచూరి గోపాలకృష్ణ, మిక్కిలినేని రాధాకృష్ణ, జమునా రమణరావు ప్రసగించారు; బియస్ ఆర్ కృష్ణ స్వాగతం తెలుపగా, మురళీమోహన్ కంపీర్ చేశారు; రాళ్ళబండి కామేశ్వరరావు సన్మాన పత్రం చదివారు; మోహన్‌బాబు వందన సమర్పణ గావించారు. మేళతాళాలతో, పూర్ణ కుంభంతో, జగ్గయ్య దంపతులను ఆహ్వానించారు. పూలమాలలతోను, పట్టు శాలువాలతోను తమ ఆనందం వెల్లడించిన వారు అరవై డెబ్భయి మంది వుంటారు. అంజలీదేవి, శారద, జమున, జయసుధ మున్నగువారు జగ్గయ్య దంపతులకు కర్పూర హారతి యిచ్చారు.... జానకి ప్రార్ధన గీతం తర్వాత, 'కమనీయ కవితలల్లే కవి, రమణీయ చిత్తరువులు వేసే చిత్రకారుడు, మేటినటుడు, స్పందన గల సామ్యవాది, మేధావి' అని కళావాచస్పతిని మెచ్చుకుంటూ, ఈ శతాబ్ది మొదటి దశకంలో జన్మించి కడపటి దశకంలో మన మధ్య మనలో ఒకరుగా వున్న సభా

ధ్యక్షులు గోపాలరెడ్డి గారికి కృతజ్ఞత తెలుపుతూ, సభకు విచ్చేసిన సోదర సోదరీ మణులకు స్వాగతం తెలిపారు బియస్ఆర్ కృష్ణ. జగ్గయ్యగారిలోని కవితా ప్రభావం గురించి పప్పు వేణు గోపాలరావు చెప్పగా, ఈ కీర్తి ప్రతిష్టలలో సగభాగం సీతారామయ్య గారికి (జగ్గయ్య తండ్రి) చెందుతాయనీ, హలం, కలం చేబట్టిన ఆయన బృహత్ కృషి ప్రశంసనీయమనీ, సీతారామయ్యగారు స్థాపించిన శ్రీకృష్ణ నాటక సమాజంలో డివి సుబ్బారావు 'హరిశ్చంద్ర', బళ్లారి రాఘవాచార్య 'రామదాసు' ప్రదర్శింపబడ్డాయనీ, ఆయన విశిష్ట వ్యక్తిత్వాన్ని వెనకటి జ్ఞాపకాలతో సభకు పరిచయం చేశారు మిక్కిలినేని. తనకు తొమ్మిదేళ్ల వయసప్పుడు, ఈ 'గురువు' తనని ఎత్తుకు యింటికి తీసుకువెళ్లి, 'ఖిల్జీ రాజ్య పతనం' నాటకంలో తనచేత డాన్సు చేయించడం, ఆ తర్వాత అదే 'గురువు'తో తన వెండితెర కథానాయి కగా నటించవలసి రావటం ఎంతో హృద్యంగా చెప్పారు జమున. 'పద్మ భూషణ్' గౌరవం జగ్గయ్యగారు ఒక్కరికే కాదు - అది మొత్తం సినీ పరిశ్రమకు చెందుతుంది - అన్నారు గుమ్మడి.... "రామారావుగారు తమ శుభాభివందన లేఖలో నన్ను అను జన్ముడు - అన్నారు. మేము చిన్నప్ప ట్నుంచీ అవిధంగానే పెరిగాము. మా నాన్నగారి ఎదుటబడి మాట్లాడే ధైర్యం నాకు వుండేది కాదు - అందు కనే 'రవీంద్ర గీతి' ఆయనకు అంకిత మిస్తూ, మాది మౌన బాంధవ్య మన్నాను. మద్రాసు ఎప్పుడు వచ్చినా 'రామారావుని ఒకసారి రమ్మనమను' - అనేవారు నాతో. నాకూ మా తండ్రి గారికీ మధ్యగల మౌనం ఒక కావ్య గానం లాటిది. సంస్కృతాంధ్రాలు నేర్వడమే గాకుండా నా జీవితానికి చుక్కాని ఆయన.... గుమ్మడి వెంక టేశ్వరరావు గారు నా మొదటి పిక్చర్ లో మామగారు - అప్పటికి యిప్పటికీ ఆయన నాకు మామగారే! ఒకసారి శాంతకుమారికి కొడుకుగా వేశాను - అప్పటికీ యిప్పటికీ ఆమె నాకు అమ్మ గారే - అబ్బాయీ అని నోరారా పిలుస్తుందామె.... మా తరం వారిని కట్టేసిన సూత్రబంధాలు యిప్పుడు లేవేమో ననిపిస్తోంది. సున్నితమైన వాతావరణంలో మేమందరం పెరి గాము, పెద్దవాళ్లమయాము, కష్ట సుఖాలూ జయాపజయాలూ చవి చూశాము. కాని, పరస్పర అభిమానం, అవగాహన మాత్రం ఎటువంటి సందర్భంలోనూ దెబ్బతినేవి కాదు. ఆనాటి విలువలు మళ్లీ నెలకొనాలని నా ఆకాంక్ష .... తుది శ్వాస దాకా నటించాలనే కోరిక నాకు లేదు. మనం ఏం చేయదలచుకున్నా, అది పూర్తిగా మన యిష్ట ప్రకారం జరుగదు. మన అభిలాషకు దేశ కాల పరిస్థితులకు పొంతన కుదరాలి. ఒకటి మాత్రం ఖచ్చితంగా చెప్పగలను. చివరిదాకా ఏదో ఒక పనిలో, కార్య నిర్వహణలో నిమగ్నమై వుంటాను. ఆ కార్యసాధన లో పాటుపడతాను. 'పేకాట' కూడా

పని అనుకొనేవారు కొందరు లేక పోలేదు. అలాటి పనికాదు - చుట్టూ వారికి ప్రయోజనకరంగా ఉండేది. పనిలోనే పరమార్థం పరమానందం ఉన్నాయి.... తమ్ముడు మోహన్‌బాబు ఋణగ్రస్తుణ్ణి చేశాడు. ఎందరికి ఎన్ని విధాల కృతజ్ఞత చెప్పుకున్నా, యింకా ఏదో చెప్పలేక పోయాననేది, గుండెల లో గుబగుబలాడుతూనే ఉంటుంది.... అందరికీ హృదయపూర్వక కృత జ్ఞతాంజలి .... సర్వేజనా సుఖినో భవంతు" - అంటూ పద్మ భూషణ్ జగ్గయ్య, తన సమాధానాన్ని రసార్ద్రత తో చెప్పారు.

. . . . . 20

'మిత్ర సినీచిత్ర' బేనర్‌లో నిర్మి స్తున్న 'ఆనంద మానందమాయనే....' చిత్రం పేరు 'ప్రేమాయణమః' గా మార్చినట్లు పత్రికా సమావేశంలో తెలియ జేశారు నవతా కృష్ణంరాజు. ఇది యిరువురి స్నేహితుల రసవత్తర గాథ అనీ, వడ్డాదిలో (విశాఖజిల్లా) తమ యూనిట్ కెంతో సహకారం లభించిందనీ చెప్పారు దర్శకులు జంధ్యాల. అయిదు పాటలు గల ఈ చిత్రంలో వరుణ్ రాజ్, అచ్యుత్, అంజలి, శ్రీకాంత్, నూతన్ ప్రసాద్, వేలు, రంగనాథ్, విజయకుమార్, మహర్షి రాఘవ, శ్రీలక్ష్మి, అనిత, సీత, అనూజ మున్నగువారు పాల్గొం టున్నారు. నవతా కృష్ణంరాజు కథ ; రాజన్ - నాగేంద్ర సంగీతం ; వేటూరి పాటలు.... నిర్మాత : అచ్యుత రామరాజు.

'టానా' వారి వరల్డ్ తెలుగు కన్వెన్షన్ (TANA - World Telugu Convention) 1993 జులై 1వ తేదీ నుంచి 5వతేదీ దాకా, అయిదు రోజులపాటు, న్యూయార్కు-లాంగ్ ఐలాండ్‌లోని హాఫ్‌స్ట్రా యూని వర్సిటీ నస్సాన్ కొలిసయమ్‌లో (17 వేల మంది కూచోవచ్చు - 12 నుంచి 15 వేల దాకా 88 దేశాల నుంచి ప్రతినిధులు రాగలరని అంచనా) జరుగనున్న సందర్భంగా, పత్రికల వారిని చెన్నపురి ఆంధ్ర మహాసభలో కలుసుకున్న 'టానా' ప్రెసిడెంట్ సత్యనారాయణ, ఆ ఏర్పాట్ల వివరా లన్నీ తెలిపారు.... తెలుగు కవుల సమావేశం, తెలుగు రచయితల సమా వేశం, అంతర్జాతీయ సంస్కృత పండి తుల సమావేశం, వేద పండితుల సమావేశం, భారతదేశ సమగ్రతకు ప్రపంచశాంతికి యజ్ఞం, ఆంధ్ర వాగ్గేయకారుల ప్రభావం, ఆంధ్ర ప్రదేశ్‌లోని విశ్వవిద్యాలయ అధ్యాప కుల సమావేశం, తెలుగు యూత్ కాన్ఫరెన్స్, వుమెన్స్ ఫోరమ్, ఆంధ్ర వైభవం సూచించే చిత్ర, శిల్ప, హస్త కళా ప్రదర్శనలతో బాటు అనేక సాంస్కృతిక కార్యక్రమాలు వుంటా యనీ, కవులు, కథారచయితలు, పత్రికా రచయితలు, నాట్యకారులు, సంగీతకారులు, కళాకారులు, విద్యా వేత్తలు, సినీ కళాకారులు, సినీ ప్రముఖులు - ఎందరో ఈ సభలలో

# చండూర్ రచనలు

నేటి విలువలు
దూరాన్ని జయించిన మానవుడు
ఛార్లెస్ స్టీన్‌మెజ్
కథానికలు
జీవనమార్గం
ఎలినార్ రూజ్‌వెల్ట్
తొలి పాఠాలు
ప్రేమగాధ
హెలెన్ కెల్లర్
డా॥ మేరివెర్జిస్
నేల - నీరు
మహానగరంలో
జీవితం
నవచైనా
ప్రతి గురువారం
ఆరు కథలు
చెట్లు
మరొక ఆరు కథలు
ఈ నాగరికత
నాలుగు రోడ్లు
అణుశక్తి
బాలరాజ్యం
గ్రామ వైద్యుడు
సాహస యాత్ర
అంతేనా
కాఫీ మానెయ్యటం

పరిచయం చేసిన పుస్తకాలు
అన్యాయం
ఆఖరి కోరిక
ఎక్కడికి కమలా ?
భానుమూర్తి భార్య
రాధ నవ్వింది
కొత్త లోకాలు
కొన్ని గ్రంధాలు
సీతతో సినీమాకు
ప్రజానాయకుడు ప్రకాశం
నట్టింట దీపం
మాంగుళూర్ మెయిల్
మహాబలిపురం
మనకీ ఒక కారు
సీతా ఫలాలు
భాష
పూసల మేడ
శివరావు
కలడోలేడో
మావో పాలనలో
చైనాలో మైనారటీలు
అమెరికా
జులై నాలుగు
వరదల్లో వాంగ్
మాతా భూమాతా
చీమలబారు

**వీటిలో ఏ ఒక్కటీ ప్రస్తుతం అచ్చులో లేవు. చదవాలను కున్నవారు మీకు చేరువలోనున్న లైబ్రరీలో దొరికితే చదవండి**

పాల్గొంటున్నారని చెప్పారు సత్యనారాయణ. తెలుగు జాతి చారిత్రక వైభవాన్ని చూపే చిత్రాన్ని ప్రఖ్యాత నిర్మాత రామానాయుడు తొమ్మిదవ 'టానా' కాన్ఫరెన్స్ సందర్భంగా రిలీజ్ చేస్తారు.. అమెరికా సంయుక్త రాష్ట్రాలలోని తెలుగువారూ, కెనడా లోని తెలుగువారూ 'తెలుగు అసోసియేషన్ ఆఫ్ నార్త్ అమెరికా' (TANA) సభ్యులు. ఈ ప్రధాన సంస్థకు అనుబంధంగా 73 యితర ప్రాంతాల తెలుగు అసోసియేషనులు వున్నాయి. ఇది నాన్ - ప్రాఫిట్ ఆర్గనైజేషన్. గవర్నింగ్ కమిటీలో 15 గురు సభ్యులు వుంటారు ; అయిదు గురు రిటైర్ కాగా, కొత్తగా మరొక అయిదుగురిని ఎన్నుకుంటారు. పది మంది పాతవారు వుండటంవల్ల, కొత్తగా వచ్చిన వారికి సంస్థ నిర్వహణలోని సాధక బాధకాలు బాగా బోధపడతాయి. '73లో అంకురార్పణ జరిగి, '74లో ప్రారంభమై, '78 లో రిజిస్టరయిన ఈ సంస్థ, యిప్పటికి ఏనిమిది కాన్ఫరెన్సులు జయప్రదంగా నిర్వహించింది - తొమ్మిదవది 1993 జులైలో. సాలీనా ఆరు లక్షల డాలర్లు వ్యయ పరిచే 'టానా' తాము చేసే ప్రజాహిత కార్యాలకు పబ్లిసిటీ కోరదు .... 'టానా' యూత్ అండ్ ఫామిలీ కాన్ఫరెన్స్ 1992 జులై 3, 4, 5 తేదీలలో వాషింగ్టన్ డి. సి. లోని జార్జిటౌన్ యూనివర్సిటీలో జరుగుతుంది - లోగడ యిలాటి కాన్ఫరెన్సులు మూడు నిర్వహించారు ; ఇది నాలవది. అలాగే 1992 జూన్ 27వ తేదీ నుంచి వివిధ పట్నాలలో తెలుగు ఫిలిమ్ ఫెస్టివల్ జరుగనున్నది. వేద పండితులు, యజ్ఞ నిర్వహణ విషయంలో తిరుపతి దేవస్థానం వారి అండదండలు, ఆర్థిక సదుపాయము వుంటాయి. పత్రికా సమావేశం తర్వాత, స్లయిడ్స్‌తో ఈ విశేషాలను విపులీకరిస్తూ చెన్నపురి ఆంధ్ర మహాసభ సభ్యులకు, యితర పెద్దలకు, ఆహూతులకు తెలిపారు టానా ప్రెసిడెంట్ సత్యనారాయణ ... ఇన్నాళ్లూ అమెరికాలో తెలుగు అసోసియేషన్, వివిధ ప్రాంతీయ శాఖల సమాఖ్యగా, ఒక్కటే ఉండేది. ఇప్పుడు రెండయాయి. టానా, అటా (అమెరికన్ తెలుగు అసోసియేషన్).

. . . . . 21

'ఆధునిక నగర జీవితం ప్రాచీన కుటుంబ సంప్రదాయాలపై దెబ్బ తీయడం సహజం. తత్కారణంగా వయసు మళ్లిన వారిని కనిపెట్టి చూడటం ఒక సమస్య అయింది. వారి యోగక్షేమాలు విచారించవలసిన బాధ్యత స్వచ్ఛంద సేవా సంస్థలపై పడుతున్నది' - అన్నారు తమిళనాడు గవర్నరు భీష్మనారాయణ సింగ్, ఆంధ్ర మహిళా సభ ప్రాంగణంలోని ఓబుల్ రెడ్డి సీనియర్ సిటిజెన్స్ హోమ్‌కి ప్రారంభోత్సవం గావిస్తూ ! మహిళా సభ అధ్యక్షురాలు సుగుణమణి స్వాగతం తెలుపగా, పారిశ్రామిక

వేత్త ఓబుల్ రెడ్డి, ఈ హోమ్‌కి సంబంధించిన విశేషాలు తెలిపారు. మహిళా సభ వారు భూమి యివ్వగా, ఓబుల్ రెడ్డి 17 లక్షలు కట్టడ నిర్మాణానికి విరాళంగా యిచ్చారు. నేషనల్ ఇంజనీరింగ్ ప్రసాద్, ఇండస్ట్రియల్ కెమికల్ ఏజన్సీస్ ఇయస్ రెడ్డి మున్నగు వారు ఈ కమిటీలో ఉన్నారు. సభకు అధ్యక్షత వహించిన తమిళనాడు ఆర్థిక మంత్రి నెడుంజెళి యన్, దుర్గాబాయి దేశ్‌ముఖ్ నాటిన విత్తనం ఒక మహా వృక్షమై శాఖోప శాఖలుగా విస్తరించడాన్ని ప్రశంసించారు. 32 గదులు, శాకాహార భోజన సదుపాయం, అంటిపెట్టుకు నర్సింగ్ హోమ్, ఆర్థో పెడిక్ సెంటర్ వంటివి గల ఈ వసతి గృహం - ఓబుల్ రెడ్డి సీనియర్ సిటిజన్స్ హోమ్ - ఎందరికో నీడని, మన శ్శాంతిని యివ్వగల దనడంలో సందేహం లేదు.

. . . . . 23

చిల్డ్రన్స్ గార్డెన్ స్కూలు శర్మగారు దివంగతులై ఏళ్లు గడిచి పోతున్నాయి. కాని, ఆ పవిత్ర స్మృతి మాత్రం కొన్ని వందల గుండెల్లో కర్పూర దీపమై వెలుగుతోంది, అసెంబ్లీహాలులో చంద్ర శేఖర్ తన వీణారవంలో పాత జ్ఞాపకాలు పలికించగా, భక్తి గీతాలు పాడారు చిన్న పిల్లల గాన బృందం. గంభీరత, పూజ్యభావమూ తొణికిసలాడే వాతావరణమది. ఆ గంటసేపూ సకూ్కా, రుకూ్కా, గీతాలతో బాటు అందరూ ఆ ప్రియబాంధవునకు నివాళులర్పించారు మౌనరాగంతో.

. . . . . 25

'భరత ఖండంబు చక్కని పాడియావు - హిందువులు లేగదూడలై ఏడ్చుచుండ - తెల్లవారను గడుసరి గొల్లవారు - పితుకుచున్నారు మూతులు బిగియగట్టి' - బిపిన్ చంద్రపాల్ 1905లో రాజమండ్రి వచ్చినప్పుడు, చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులు తన ఉపన్యాసంలో చెప్పిన పద్యమది. ప్రభుత్వానికేమి చేయాలో తోచక కిమ్మన కుండా వూరుకుంది. స్వాతంత్ర్య పోరాటంలో తెలుగు కలం ఆనాడే తన దీప్తిని ప్రసరింపజేసింది. ముట్నూరి వారి 'కృష్ణా పత్రిక', పట్టాభిగారి 'జన్మభూమి', ప్రకాశంగారి 'స్వరాజ్య', స్వాతంత్ర్య సాధన వైపుగా తమ కలాలని పదును పెట్టాయి. ఆనాటి జర్నలిస్ట్ ఒక లక్ష్యం కోసం పోరాడే సైనికుడు. స్వాతంత్ర్య సిద్ధితో ఆ లక్ష్యం నెరవేరిన మాట నిజమే! కాని, సమస్యలు తీరాయా? లేదు. లెక్కకు మించిన సమస్యలు. ఆ తోరణం ఆనాటి కానాడు పెద్దదవుతోంది. 'మాకొద్దీ తెల్లదొరతనం' అన్నారు గరిమెళ్ల. తెల్లదొరతనం పోయి, మన దొరతనం వచ్చిందే గాని సగటు పౌరుని సమస్యా వలయం దయనీయమవుతోంది. చుట్టూ యింత అవినీతి, లంచగొండి తనం, అధికార లాలస, దౌర్జన్యం పేట్రేగి పోతున్నప్పుడు పత్రిక

లకు పోరాడేందుకు ఏమీ లేక పోవడమేమిటి? ఆ పోరాట శక్తి సన్నగిలింది. మనకెందుకు లెమ్మనే ఉదాసీనత, చిత్త శుద్ధి లేక పోవడం; ఎక్కడి కక్కడ ముళ్లు. 'పత్రికా స్వాతంత్ర్యం' అని పెద్దగా చెబుతూంటారు. ఆ స్వాతంత్ర్యం ఎవరికి? వ్రాసే వారికా? యాజమాన్యానికా? ఆ యాజమాన్యానికి ఎన్ని 'వెస్టెడ్ ఇంటరెస్ట్ సో!' పత్రికలు పెద్దవయాయి. కాని, ప్రొఫెషనలిజమ్ పేరిట సంపాదకులు స్వాతంత్ర్య రహితులయారు' - అన్నారు సుప్రసిద్ధ జర్నలిస్ట్ డి ఆంజనేయులు, సాహిత్య అకాడమీ, ఎపి ప్రోగ్రెసివ్ రైటర్స్ అసోసియేషన్, సంయుక్తంగా పొట్టి శ్రీరాములు హాలులో ఏర్పరచిన సాహితీ సమావేశ సందర్భంగా. అధ్యక్షత వహించిన ఎయస్ రామన్ వెనకటి సంగతులు ఎంతో హృద్యంగా చెప్పారు. " 'సమాచారం ఎక్కడ నుంచి అందిందో చెప్పను - కరస్పాండెంట్‌ని కాపాడ వలసిన బాధ్యత నాది' - అని తొమ్మిది నెలల జైలు శిక్ష అనుభవించారు దేవదాస్ గాంధీ.... 'ఆ విషయం బయట పడటం గవర్నరు గారికి యిష్టం లేకపోతే నేనేం చేయగలను? నా డ్యూటీ నేను చేస్తాను' - అన్నారు ప్రభుత్వ కార్యదర్శితో మొరే. టైమ్స్ ఆఫ్ ఇండియా ఎడిటర్ ఫ్రాంక్ మొరె. హర్ని మాన్, బ్రెల్వి, చలపతిరావు, రామారావు, ఆర్థర్ మూర్, చింతామణి, స్ప్రాట్ - యిలా ఎందరో ఆదర్శ మూర్తులు. 'నన్ను వైస్రాయి సలహా సంఘంలోకి తీసుకున్నంత మాత్రాన, ప్రభుత్వాన్ని విమర్శించకుండా వుంటాననుకున్నారా?' - అని సర్ సి వై చింతామణి వంటివారు మాత్రమే అనగలరు. అంతటి ఆత్మధృతి ఎక్కడున్నది ఈనాడు? నేటి పత్రికా ప్రచురణ వ్యాపార సూత్రాలకు, యితర వొత్తిడులకు లోబడక తప్పడం లేదు" - అన్నారు ఎయస్ రామన్.

—యన్నార్ చందూర్



# మనవి

మీరు విన్నవీ మీ అనుభవంలో వున్నవీ పదిమందికి చెబితే బావుంటా యనుకొనే 'జోక్స్', నిమ్మతొనలు శీర్షికలో ప్రచురింపబడతాయి. ఈ పత్రికకు సంబంధించిన సూచనలకు, విమర్శలకు 'పాఠకుల తీర్పు'. ఈ పత్రికలో వెలువడేవన్నీ మా అంతట మేము కోరి వ్రాయించేవి - అంచేత, ప్రచురణ నిమిత్తం వ్యాసాలూ, కథలూ, కవితలూ పంపవద్దు. ఎప్పుడైనా అవసరమైతే, మేమే అడుగుతాము.... చందా 24 సంచికలకు : ఏభై రూపాయిలు.

JAGATI - 2, Kutchery Road, P.B. 2922, Mylapore, Madras-600004.



# చిత్రజగతి సమీక్ష

సాహితీ చిత్రవారి

## 'యజ్ఞం'

మేధావులని ఆలోచించమనీ, సామాన్యులని తర్కించుకోమనీ, శ్రమజీవులని మేలుకోమని కాళీపట్నం రామారావు మాస్టారు రచించిన 'యజ్ఞం' (1964), అనేక మంది ప్రముఖ రచయితల అభిప్రాయాలతో 'కథా యజ్ఞం' గా వెలువడింది. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారి అవార్డుని రామారావు మాస్టారు నిరాకరించారు. ముప్పయ్యవ దశకంలో ఉత్తరాంధ్ర 'సుందర పాలెం' గ్రామంలోని వర్గాల, వర్ణాల జీవిత చిత్రణతో ప్రారంభమై, పాతికేళ్ల సామాజిక పరిణామాలని మన కళ్ల ముందు వుంచుతుంది.

భారతీయ వ్యవసాయంలో మెట్ట భూములు, పల్లపు భూములు అనే విభజన అనాదిగా ఉంటున్నది. నీటి వనరు గల భూముల్లో ఆహార ధాన్యాలు పండించేవారు - మిగతావే యితర పంటలకు (కాష్ క్రాప్స్). ఈ విభజన మొదటి ప్రపంచ యుద్ధం నాటికే (1914) చెరిగి పోవటం ప్రారంభించింది. 1925 లో రవీంద్రనాథ్ టాగూర్, పద్మా నది మీద స్టీమరులో తన ఎస్టేట్‌కి వెళ్తూ, యిరు వైపులా ఏపుగా ఎదిగిన జనపనార (జూట్) చూసి, నా 'సోనార్ బంగ్లా' ఏమైపోతున్నదని విలపిస్తారు 'గ్లిమ్సెస్ ఆఫ్ బెంగాల్'లో. ఈ ప్రస్తావన ఎందుకంటే, మన స్వాతంత్ర్యోద్యమానికి, గ్రామ సీమల్లో ఏర్పడ్డ మార్పులకి సంబంధంలేదు. రెండవ ప్రపంచ యుద్ధకాలంలో పట్నాలలోని కొందరు సాహసికులు కుబేరులు కాగా, గ్రామాలలోని బలవంతులు బలహీనులని దోచుకున్నారు - ఈ పిక్చర్‌లోని శ్రీరాములు నాయుడు (కామేశ్వర్) మాదిరి, - తాము వేసిన బాట దోపిడీ పద్ధతికి మరింత దోహదకారి అయిందనే స్ఫురణ కూడా లేకుండా.

వేదకాలంలో 'యజ్ఞం' లోక కళ్యాణానికైతే, యిక్కడ ఈ 'యజ్ఞం' బానిసత్వ విముక్తికి. సుందర పాలెం హరిజనవాడలోని అప్పల రాముడు (పియల్ నారాయణ) తన కులంలో పెద్ద - ఖామందులకు విధేయుడు. ముగ్గురు మగపిల్లల తర్వాత నాలుగో వాడు కలుగుతాడు - సీతారాముడు. మిగతా ముగ్గురి పేర్లలో కూడా

'రామ' శబ్దం ఉంది. తమ్ముడూ తనూ విడిపోయాక, నాలుగెకరాల నేల ఉంటుంది. రెండో కొడుకు మాట ప్రకారం వేరుసెనగ వేస్తాడు. చేనేత మగ్గం మూల పడగా గోపన్న, కమీషన్ వ్యాపారంలోకి దిగి, అప్పల రాముడి పంట పట్నంలో అమ్మి డబ్బు తీసుకొస్తాడు. ఈ అప్పల రాముడు నమ్మకం వుంచడం వల్లనే, గోపన్న బాగుపడతాడు. అతని కమిషన్ వ్యాపారమూ, యితని వేరుసెనగ-రెండూ వృద్ధిలోకి వస్తాయి. నాలుగెకరాలని పదెకరాలు చేయ చేయగలుగుతాడు అప్పల రాముడు. నలుగురు కొడుకులు, నలుగురు కోడళ్ళ, వుమ్మడి సంసారం; విడిపోయినప్పటికీ తమ్ముడూ మరదలూ అభిమానంగా ఉండటం - అప్పల రాముడి కుటుంబ జీవనం హాయిగా గడిచిపోతూంటుంది.

'లా' చదువు మధ్యలో ఆపేసి' గాంధీజీ బోధలతో గ్రామాన్ని పునరుద్ధరించడానికి వచ్చిన శ్రీరాములు నాయుడు కారణంగా, అప్పల రాముడు పంచాయితీ మెంబరవుతాడు; ఊళ్లో స్కూలు పెడతారు; ఊరికి రోడ్డు వేస్తారు: ఊరవతల రైసు మిల్లు పెడతారు; విద్యుచ్ఛక్తి పట్టుకొస్తారు; ఇళ్లలో దీపాలు వెలుగుతాయి. పైకి అంతా బావుంటుంది.

కాని రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో రైలు వేగనులు దొరక్క ధరలు పడిపోతాయి. చిన్న తరహా కమీషన్ వ్యాపారి గోపన్న కూలిపోతాడు - పెద్ద చేప చిన్న చేపల్ని మింగినట్టు; అప్పల రాముడి పదెకరాలూ రెండెకరాలవుతుంది; ఊళ్లోకి బస్సు రావటం వల్ల, ఎడ్లబళ్లు కట్టించుకొనేవారుండరు; ఆ బళ్లనీ ఎద్దులనీ అమ్మేయ వలసి వస్తుంది: నాలుగో కొడుకు సీతారాముడు (భానుచందర్) పట్నంలో కూలిపని కని వెళ్లిపోతాడు. మూడేళ్ల కొడుకుని వొదిలి పెట్టి ఆ సీతారాముడి భార్య ఒక ఫోటోగ్రాఫర్‌తో లేచిపోతుంది; పసివాణ్ణి సాకలేక మళ్లీ తండ్రి పంచకి చేరుకుంటాడు సీతారాముడు.

కమీషన్ వ్యాపారి, పేదరైతు లావాదేవీలలో, ముక్కుకి సూటిగా పోయే అప్పల రాముడు గోపన్నకు డబ్బు బాకీ పడతాడు. నోటి మాటగా వున్నది పత్రం రాయిస్తారు. ప్రామ్సరీ నోటుకి కాలదోషం పట్టకుండా, గోపన్న పంచాయితీలో ఫిర్యాదు తెస్తాడు. ఈ రెండెకరాలు కొనుక్కునేందుకు సిద్ధంగా వున్నాడు మునలయ్య అనే మరో రైతు. శ్రీరాములు నాయుడి మీద ఎంతో గురీ, గౌరవం గల అప్పల రాముడు ఆయన తీర్పుపై ఆశ పెట్టుకుంటాడు - పూర్వాపరాలన్నీ విచారించి తీర్పు యిస్తాడనుకుంటాడు. శ్రీరాములు నాయుడు ఆ డబ్బు తను చెల్లిస్తానంటాడే గాని, తన 'వర్గ' బుద్ధిపోగొట్టుకోడు. అప్పల రాముడు తన రెండెకరాలు మునలయ్యకు అమ్మి గోపన్న అప్పు తీర్చగా, సీతారాముడు తన మూడేళ్ల

కొడుకుని నరికి, ఆ రక్తసిక్త పసి దేహాన్ని గోనె సంచిలో మూట కట్టి, పంచాయితీ ముందు నుంచి, 'మా కిక దాస్య విముక్తి' అంటాడు.

ఈ కథ చదికాక కొన్ని సందేహాలు కలగకపోవు. కాని, ఆ సందేహాలు పక్కకి నెట్టి, పిక్చర్ చూశాక, మీ అభిప్రాయం మీరు ఏర్పరుచుకోండి. ఇది డిష్కా డిష్కాలూ డ్యూయట్ల సినిమాకాదు. రాష్ట్ర ప్రభుత్వం దీనిని 'సువర్ణనంది'తో ఎందుకు సత్కరించిందో స్వయంగా చూసి తెలుసుకోండి - బాక్సాఫీసు సూత్రాలేమీలేని రక్తాక్షర చిత్రమిది.

ముప్ఫయి ముప్ఫయ్యాయిదేళ్ల క్రితం 'హౌగ్రీన్ వజ్ మై వాలీ' (How Grees was My Valley) అనే నవల చదివాను; ఆ పిక్చర్ కూడా చూశాను. ఆ నవలా రచయిత రిచర్డ్ లావిలాన్, పోలీస్ స్టేషన్ ఏర్పడక పూర్వం, తమ లోయ ఎంత మనోహరంగా, మానవతా బంధాల మధురిమతో ఎలా అలరారేదో చెబుతాడు. ఇది వుడుకులోన్ పరిమళం అంత సుతారమూ నాజూకయినదీ కాదు - ఘాటైన రక్త చందనం

పియల్ నారాయణ, భానుచందర్, వంటివారు తమ పాత్రలని గొప్పగా పోషించారు. పాటలు : సినారె, గజ్జెల మల్లారెడ్డి. చక్రవర్తి సంగీతం, నవకాంత్ కెమెరా. దర్శక నిర్మాత రామినీడు, అంకిత భావంతో నిర్మించిన ప్రయోజనాత్మక చిత్రం....

పిఆర్ఓ : పసుపులేటి రామారావు.

# ముఖ చిత్రం

1991 మే 21వ తేదీ రాత్రి ఎనిమిదిన్నరకి మద్రాసు విమానాశ్రయంలో పత్రికా సమావేశం. తొమ్మిదింపావుకి తాత గారి (నెహ్రూ) విగ్రహానికి పూల గుచ్ఛం. పదీ పదికి శ్రీ పెరంబదూర్ చేరుకు, తల్లి (ఇందిరా గాంధీ) విగ్రహానికి పుష్పమాల. పదీ ఇరవైకి కారు దిగి, మృత్యు ముఖంలోకి ప్రవేశం.... భావి భారత భాగ్యోదయ రేఖ చెరిగిపోయింది; 21వ శతాబ్ది స్వప్నం చెదిరిపోయింది; నలభైఏడుకే నూరేళ్లూ నిండి, ప్రజాహృదయ పలికించిన రాజీవ్ గాంధీ, చరిత్రలో కలిసిపోయారు. సమస్త లోకం దుఃఖాశ్రువులతో తడిసిపోయింది.

'నాకు రాజకీయాల గురించి తెలీదు. అమ్మకు సాయంగా వుందామని దిగాను. సోనియాకు సుతరామూ యిష్టంలేదు'

'ప్రజలెప్పుడూ నన్ను మా తాత గారితోనూ, తల్లిగారితోను పోల్చి చూడబోతారు'

'నాకూ ఒక స్వప్నం వుంది. ఈ దేశం బలంగా, దృఢంగా, సర్వస్వతంత్రంగా, స్వయం సమృద్ధితో, ప్రథమశ్రేణి దేశాలలో ఒకటై నిలబడాలని నా సురుచిర స్వప్నం.'

సైన్స్ ఫిక్షన్

# జూలియస్

## అన్నపూర్ణా రెడ్డి

గడిచిన కథ: న్యూ ఇయర్ కవి మల్హోత్రా కాజిల్ లొలిటాకు రాజేష్ వచ్చాడు. సునీత రిసీవ్ చేసుకుంది.... వేడినీళ్ల స్నానమయాక, కుర్చీలో రిలాక్స్ అయి వుండగా యిట్టే కునుకు పట్టింది - ప్రయాణ బడలికవల్ల కావచ్చు. లంచ్ టైమయింది.... (ఇక చదవండి

"సారీ, .... లంచ్ టైమ్ అవుతుందని అనుకోలేదు.... వేడి షవర్ తీసుకొనే సరికి.... నిద్ర ముంచు కొచ్చేసింది....!" నొచ్చుకున్నాడు.

"నెవర్ మైండ్.... ఆ బ్రేక్‌ఫాస్ట్ కాస్తా.... నేనూ డాక్టర్ షార్మా ఆరగించేశాములే" అన్నాడు తాపీగా....

"ఓఁహ్ డాక్టర్ షార్మా కూడా వచ్చేశాడన్నమాట.... నాకేమో మొద్దు నిద్ర పట్టేసింది.... వ్వేర్ ఈజ్ హీ ....?" అటూ ఇటూ చూశాడు రాజేష్.

"అతని గదిలో.... బహుశా ఈ పాటికి వచ్చేస్తుంటాడు".... ప్రక్క గది తలుపు తెరుచుకొని బైటకొచ్చిన డాక్టర్ షార్మా.... "హలో రాజేష్.... హౌ వ్వా ర్యూ...." ఆప్యాయంగా కరచాలనం గావించి మరో చేత్తో మిత్రుణ్ణి దగ్గరగా పొదువుకున్నాడు.

వైట్ షర్టు,.... స్నఫ్‌కలర్ పేంటులో టక్‌చేసి బాల్డ్‌నెస్ కప్పిపుచ్చుకోవడానికి వున్న జుట్టును దువ్వుకొన్నాడు. .... చప్పిడి ముక్కు.... మరీ దట్టమైన కనుబొమలు .... బలిష్టమైన పెదవులు .... నెలవంకలాటి మీసాలు.... నీట్‌గా షేవ్ చేసిన గడ్డం. రెండుగా అవుపించే గడ్డం నొక్కు.... షర్టు పైభాగాన గుండీ వదిలేయడంతో.... గొంతు వరకూ పరచుకొన్న నల్లని జుట్టు. మనిషిలో ఏ మాత్రం మార్పు లేదనిపించింది.

కబుర్లు చెప్పుకుంటూ కార్పెటెడ్ స్టెప్స్ దిగి హాల్లోకి వచ్చారు ముగ్గురూ .... అక్కడే సోఫాలో కూర్చుని లేడీస్ మేగజైన్ తిరిగేస్తున్న సునీత లేచి నుంచొని "అంకుల్ రాజేష్,.... బ్రేక్‌ఫాస్ట్ వడ్డించమని చెప్పానా" అంది... ఉబికి వస్తున్న నవ్వును పెదిమెల మాటున దాచుకొంటూ.

"యాజ్ యూ విష్ బేబీ..." అన్నాడు ప్రేమగా చూస్తూ.

లంచ్‌కి.... కిచెన్ గార్డెన్ పండించిన కూరగాయలతో కమ్మని వంటకాలు తయారు చేయించింది సునీత,

కూలాసా కబుర్లు చెప్పుకొంటూ సుష్టుగా భోంచేసి లేచారంతా.

డాక్టర్ మల్హోత్రా కోసం పొరుగూరు నుండీ మనుష్యులొచ్చి అర్జెంట్ కేసంటూ తీసుకెళ్ళిపోవడంతో .... ప్రయాణపు బడలిక గుర్తు రాగా తమ గదుల కెళ్ళిపోయారు....

సాయంత్రం.... అడవిదారి వెంట అందాలను ఆస్వాదిస్తూ వాకింగ్ వెళ్ళి వచ్చాక.... వేడివేడి పుల్కాలు ... ఆలూమటర్ కూర్మా, సలాడ్, రెండు రకాల స్వీట్లతో.... డిన్నర్ ముగించి కాఫీ కప్పులందుకొని హాల్లో కూర్చున్నారంతా....

"మేం ఎప్పుడొచ్చినా.... మిసెస్ మల్హోత్రా - ఇంటిలో గైరు హాజరు .... ఏం డాక్టర్,.... మేము రావడం ఆమె కిష్టం వుండదా ?".... చిన్ననాటి స్నేహాన్ని పురస్కరించుకొని మనసులో మాట బైటపెట్టాడు డాక్టర్ షార్మా.

గుప్పు గుప్పున పొగ వొదలి నోట్లోంచి పైపు తీసి ప్రక్కనుంచి పెద్దగా నవ్వి....

"అరె యార్.... నేనోమాట అడగనా.... ఇన్ని సంవత్సరాల పరిచయంతో.... ఒక్కసారికూడా నీభార్యనుగానీ. ఇదిగో ఈ ప్రబుద్ధుడు తన భార్యను గానీ....పిలుచుకొని హాలిడే ఎంజాయ్ చేయడానికి రారెందుకని ? ఇక్కడికి మీ లేడీస్ రావడం మీ కిష్టంలేదా ?" సూటిగా ప్రశ్నించాడు.

అభియోగానికి మొదట బిత్తరపోయి ఒకరి ముఖాలొకరు చూచుకొని ఆపై పెద్దగా నవ్వేస్తూ....

"ఇది చాలా సున్నితమైన విషయం డాక్టర్ మల్హోత్రా.... ఏడడుగుల బంధం. జన్మజన్మల బంధం అంటారు గానీ.... వ్యక్తిత్వాల దగ్గరి కొచ్చేసరికి రాజీపడరు స్త్రీ పురుషులు. ఎవరి అభిరుచి వారిది. ఒకరి అభిరుచి నొకరు మన్నించితే పేచీలే లేవు. అంచేతే.... ఈఒక్క విషయమేకాదు... ఏవిషయంలోనూ ఒకరి మీద వొత్తిడి తేవడం మంచిదికాదని స్వానుభవం.... వ్వాట్ మిస్టర్ రాజేష్" - జబ్బమీద చరిచాడు డాక్టర్ షార్మా.

"యు ఆర్ రియల్లీ వండ్రఫుల్. ఆడవాళ్ళతో పేచీపడకుండా, మంచి సూత్రం కనిపెట్టావ్. నొప్పింపక తానొవ్వక తప్పించుకు తిరుగువాడు ధన్యుడు సుమతీ అన్నాడు శతక కారుడు... నేనూ మీ కోవలో వ్యక్తినే" - అన్నాడు కన్నుగిలికి నవ్వుతూ.... డాక్టర్ మల్హోత్రా.

అరమరికలేకుండా అలా మనసులు విప్పి మాట్లాడుతూ నవ్వుకొంటున్న మిత్రత్రయాన్ని విస్ఫారిత నేత్రాలతో చూస్తూండి పోయింది సునీత.

"ఏం.... బేబీ.... ముసలి వాళ్ల గొడవ బోర్ కొట్టుతోందా ?" అన్నాడు రాజేష్.

"నో.... నో.... నా ట టా ల్ అంకుల్ .... ఇట్స్ వెరీ ఇంటరెస్టింగ్" అంది కళ్లువాల్చుకుంటూ

"బేబీ.... వెదర్ ఫైన్‌గా వుంటె .... ఆల్మోరా లేక్‌లో వాటర్ స్కయింగ్, స్విమ్మింగ్.... సన్‌బేదింగ్ .... ఇవీ రేపటి ప్రోగ్రాంలో ఐటమ్స్ .... ఒకే...." – అన్నాడు మల్హోత్రా.

"థాంక్యూ అంకుల్, థాంక్యు సోమచ్".... అంది.... తన్నుకొస్తున్న సంతోషాన్ని దాచుకుందుకు ప్రయత్నిస్తూ.

ఓ రౌండ్ పేక కలిపి,.... గుడ్ నైట్ చెప్పుకొంటూ ఎవరి గదికి వారెళ్ళిపోయారు.

## 2

ఆల్మోరా ప్రయాణం తరువాత.... మరుదినం నైనిటాల్ లేక్‌లోనే బోట్ రైడ్.... చైనా అబ్జర్వేటరీ దాకా, పోనీ రైడ్.... చేయిచేయి కలుపుకొని.... కబుర్లు చెప్పుకొంటూ తల్లితాల్ నుండీ మల్లితాల్ వరకూ మాల్ రోడ్ మీద పచార్లు చేస్తూ... గడిపేశారు.

థర్టీఫస్ట్ మాత్రం ఎక్కడికీ పోకుండా ఇంటిలోనే కూర్చొని పేక, చెస్.... కబుర్లు, జ్ఞాపకాలతో కాలక్షేపం చేస్తూ గడపాలని నిశ్చయించుకున్నారు.

ముప్పై ఒకటి ఉదయాన్నే రంగు రంగు బల్బుల తోరణాలతో 'కేజిల్ లొలిటా'ను దేదీప్య మానంగా తీర్చిదిద్దారు నౌకర్లు. క్రొత్త సంవత్సరానికి స్వాగతం పలుకుతూ "హేపి న్యూ యర్" అని రాసి చుట్టూ బల్బులతో అలంకరించారు.

డిన్నర్ తరువాత కాస్సేపు హాలులో కూర్చున్నారు మిత్రులు.

రాత్రంతా అలా కబుర్లు చెప్పుకొంటూ నూతన సంవత్సరానికి స్వాగతం పలకాలని కూర్చుండిపోయారు.

"బేబీ.... కాస్సేపు.... నీ సంగీత పాండిత్యం వీళ్ళకూ రుచి చూపించమ్మా" - అన్నాడు డాక్టర్ మల్హోత్రా.

"వ్వాట్ సునీతకు సంగీతంతో టచ్ వుందా.... మరి వచ్చినప్పటి నుండీ చెప్పలేదే.... సంగీతం నాకే కాదు.... మా ఫారమ్‌లో జర్సీ ఆవులకూ ఎంతో ఇష్టం. ముర్రా బఫెలోస్‌కు ఏదీ అవసరం లేదు!" అన్నాడు డాక్టర్ షార్మా.

"ఈజిట్" - అన్నాడు కుతూహలంతో రాజేష్.

"ఎస్ రాజేష్.... మిల్కింగ్ షెడ్స్‌లో సంగీతం, కొంచెం శృతి లయ కలిసిన పాటలు కానీ, ఇన్స్ట్రుమెంటల్ గానీ పెట్టామంటె ఆవు పాలు సమృద్ధిగా ఇస్తాయి. కౌస్ ఆర్ వెరీ సెన్సిటివ్.... అసలు ఆవులకున్న సునిశిత బుద్ధి మానవునికి కూడా లేదు. యాజమాని సంతోషంగా వున్నా, విచారంగా వున్నా ఇట్టే పసి గట్టేస్తాయి"

'రియల్లీ ?' అంది సునీత.

"ఓ రోజు.... మా ఆవిడతో పేచీ పడి అలాగే కేటిల్ షెడ్స్‌కి వెళ్ళిపోయాను. అక్కడికి వెళ్ళాక ఏమి పనీ చేయ బుద్ధి కాలేదు.... మంచం వేసుకొని అలాగే పడుకుండిపోయాను.

.... యు బిలీవ్ ఇట్ ఆర్ నాట్... పనివాళ్లు వాటికి మేత వేసినా అవి తిన లేదు.... ఆలాగే తలలు వాల్చుకొని నిలబడిపోయాయి. వాటి కళ్ళలో నీలి నీడలు."

"ఓ(హో అంకుల్ .. అలా జరుగు తుందంటారా ? ... అవి యానిమల్స్ - అంత సునిశితంగా పసిగట్టు తాయా ?"

"చెప్పా గదమ్మా.... బఫెలోస్ మాట వొదిలేయమని. ఆవుల కున్న ఆప్యాయతకు, నా కళ్లు చెమర్చాయనుకో.... నా కోపం పటాపంచలైంది. లేచి వెళ్ళి వాటి గంగడోళ్లు నిమిరి .. నవ్వుతూ పలుకరించాక మేతతిన్నాయి .... చెదిరిన నా మనసు కుదుట పడింది. ఇంట్లో పేచీ వస్తే కలత తీరేది కేటిల్ షెడ్‌లోనే".... అంటూ సోఫాలో వెనక్కు వాలారు డాక్టరు షార్మా....

"చాలా గమ్మత్తుగా వుంది అంకుల్".... ఉత్సాహంగా పలికింది సునీత.

"ఈ మధ్య రిసెర్చిలో తేలిందేమంటే.... ఒకే ఆవు పాలు రోజూ ఒక గ్లాసు తాగితే డయాబెటిస్ నయమవుతుందిట... మైండిట్... ఒకే ఆవు అంటే ప్రతి నిత్యం ఆ ఆవుపాలే తాగాలన్న మాట.... గేదెపాలు పనికి రావు.... !"

"గుడ్.... ఎంతో మంది డయాబెటిక్స్‌కు పనికి వచ్చే రిసెర్చిబిట్...." ప్రశంసా పూర్వకంగా చూచాడు డాక్టర్ మల్హోత్రా.

"ఒకే ఆవు పాలు ప్రతి నిత్యం దొరకడం అనేది కష్టం అంకుల్ !..."

"మరి పాయింట్ అదే ఇక్కడ" అన్నాడు మల్హోత్రా....

బాబ్డ్ హెయిర్ సుతారంగా మెడ మీదకు నెట్టుకొంటూ చిరునవ్వుతో చూచింది సునీత.

దేదీప్యమానంగా వెలుగుతున్న లైట్ల కాంతిలో బ్లూస్ట్రైప్ పేంటూ, బ్లూస్లీవ్‌లెస్ ఉలెన్ స్వెట్టరు.... నిండు రంగులో అవుపిస్తున్నాయి. బుగ్గల మీద లైట్ రిఫ్లెక్ట్ అవుతోంది. క్షణం సేపు మల్హోత్రా కళ్లు మేన కోడలి మీద తారట్లాడాయి.

"గోవును గోమాతగా పూజించే మన దేశంలోనే ఈ దౌర్భాగ్యం.... ఏం చేద్దాం.... ప్రతిదీ కరువే!" అన్నాడు రాజేష్.

"రాజేష్, ఆ మధ్య బిజినెస్ ట్రిప్ స్టేట్స్‌కు వెళ్ళినట్లున్నావు ?"

"ఎస్, డాక్టర్ మల్హోత్రా !... ప్లాస్టిక్ ఇండస్ట్రీలో కొన్ని మెడికల్ స్పేర్స్ తయారీ చేయాలని ప్రగాఢమైన కోరిక నాలో కొంత కాలంగా నిగూఢంగా వుంది."

"వ్వాటె నోబుల్ ఐడియా. ఫర్ ఎగ్జాంపుల్ ?" - రాజేష్ వంక సూటిగా చూశాడు డాక్టర్ మల్హోత్రా.

"లేడీస్‌కు కాస్మెటిక్ పర్పస్‌కు పనికి వచ్చే ముఖ్యమైన షేప్డ్

ప్లాస్టిక్స్, వేరియస్ కండిషన్స్‌లో పిల్లలు కలిగి, పిల్లలకు పాలిచ్చాక తిరిగి షేప్, సైజు కలిగించడానికి స్కిన్ క్రిందనే ఎంబెడ్ చేసి నాచురల్ అప్పియరెన్స్ కల్పించేందుకు వీలుగా .... ఆర్టిఫిషియల్ ప్లాస్టిక్ బ్రెస్ట్స్. రెండోది: సర్టెన్ ఏజ్ వచ్చేసరికి కాళ్ళలో, ఎస్పెషలీ మోకాలి నెప్పు లధికమవడం, నడవలేక బాధపడు తూంటారు స్త్రీ పురుషులు ఏ మంటే కార్టిలేజ్ అరిగి పోయిందనీ, గ్రీజు ఎండిపోయిందనీ డాక్టర్లు చెపుతూం టారు.... ఆ అరిగి పోయిన కార్టిలేజ్ స్థానే కార్టిలేజ్ లాటి ప్లాస్టిక్స్.... మూడోది: హార్ట్ వాల్వ్స్ అండిసీజ్ ఏమిటో దాని తతంగం ఏమిటో నీకే బాగా తెలుసు డాక్టర్ మల్హోత్రా.... ఇవన్నీ దృష్టిలో పెట్టుకొని ఫారిన్‌లో ఈ లాటి పరికరాలను తయారు చేసే కొన్ని సంస్థలను చూచి వచ్చాను.... ఈ ఆలోచన కార్య రూపం దాల్చడానికి సాధన సంపత్తే కాకుండా మరి కొంత వ్యవధి కావాల్సి వుంది.... ఆ పై పబ్లిసిటీ... ఆర్డర్స్ తెచ్చుకోవడం వగైరా వగైరా వున్నాయి''

విస్ఫారిత నేత్రాలతో.... రాజేష్ వంక చూస్తూ కుతూహలంగా వింటూంది సునీత. బహుశా ఊహా పథంలో అలాటి ప్లాస్టిక్స్ ధరించి గర్వంగా తిరిగే జనాదులు కదులాడారు కాబోలు...

డాక్టర్ షార్మా కూడా అటెంటివ్‌గా కూర్చొని వింటున్నాడు.

"విష్ యు ఆల్ ది బెస్ట్, రాజేష్. త్వరగా రంగంలోకి దిగితే నీ ఐడియాలను కార్యరూపం ధరించేట్టు చూడ్డం ఎంతైనా అవసరం వుంది... మన వేదాల్లో ఎన్నో వైజ్ఞానిక రహస్యాలు దాగి వున్నాయంటారు. ఇటు వైద్య రంగంలోను, అటు వైజ్ఞానిక రంగం



రుచిలో నెం.1
క్రేన్ వక్కపొడి
దక్షిణ భారతదేశపు నెం 1 వక్కపొడి
CRANE
CRANE



లోను, వేదకాలం నాటికే ఎంతో ప్రగతిని సాధించినట్లు చదువు కొంటూంటాము... అయినా మానవుని తృష్ణ... ఇంకా ఏదో సాధించాలన్నది. ప్రతి తరములోను వైజ్ఞానికంగా అన్ని రంగాలలో ప్రయోగాలు సల్పుతూనే ఒక్కో మెట్టే పైకి చేరుకున్నారు. ఒకప్పుడు సముద్రయాన మంటే మహా గొప్ప. ఈ రోజు చంద్రమండలం యాత్ర కూడా సాధించాడు మానవుడు. మరిప్పుడేమో గెలక్సీల రహస్యాలను ఛేదించి అందులోని జీవరాసులతో సంబంధ బాంధవ్యాలను కలిగించుకోవాలని అపేక్షిస్తున్నాడు... మానవునిలో దాగిన తృష్ణే అంతటికీ మూలకారణం.... ఆ తృష్ణ అతని తరానికి కాకపోయినా ముందు తరాల వారికి మేలు కల్గించేదిగా వుండాలి."

క్లాప్.... క్లాప్.... క్లాప్.... చప్పట్లు చరిచి, "మామయ్యా, ఇంత చక్కటి ఉపన్యాసం వినడం నాకెంత సంతోషంగా వుందో తెలుసా ?" - అంది సునీత.

ప్రేమగా మేనకోడలి వైపు చూశాడు డాక్టర్ మల్హోత్రా... చేయి ముందుకు చాచాడు లేచివచ్చి చేయి అందుకొంది.... ఆ చేయినే సుతారంగా ముందుకు లాగి ప్రక్కలో కూర్చొనబెట్టుకు, ఆ అమ్మాయి తలను రెండు చేతులా వొడిలోకి లాక్కొని నుదురు మీద ముద్దు పెట్టుకున్నాడు.

"ఈ పిల్ల తెలివి తేటలు అల్లరి చూస్తే వాళ్లమ్మ, ఐ మీన్, నా చెల్లెలు ఎంత సంబరపడేదో! కానీ, పిచ్చి తల్లికా అదృష్టం లేదు. భర్త యాక్సిడెంట్‌లో పోతే, మనసు కూడదీసుకొని జీవించలేక స్లీపింగ్‌పిల్స్ ఓవర్ డోస్ తీసుకొని భర్తను వెదుక్కుంటూ వెళ్ళిపోయింది. సునీత కప్పుడు ఏడాది. ఆ పసిబిడ్డ మీద మమకారమైనా, తన జీవితం మీద వ్యామోహం కల్గించ లేకపోయింది. ఇప్పుడేమో ఈ అల్లరిపిల్ల వాళ్ల మామ చెవులు పట్టుకు ఆడిచేంస్తోంది. ఫిర్యాదు చేద్దామంటే ఎవరూ లేరు" – అన్నాడు డాక్టర్ మల్హోత్రా.

"లేకపోవడ మేమిటి ?" - బుద్ధావతారంలా కూర్చున్న డాక్టర్ షార్మా అన్నాడు.

"ఎవరు ?.... ఎ క్క డ !...." మల్హోత్రా ప్రశ్నించాడు

"ఎక్కడో అక్కడ వుండే వుంటాడు... ఈ అడవుల్లో, కొండ కొనల మధ్య ఓ చిన్నది వుందని తెలిస్తే వాడే వస్తాడు వెదుక్కుంటూ!" ఉడికించాడు షార్మా

"యు మీన్...ది ఎంగ్ మాన్ హూమ్ సునీతా డ్రీమ్స్ ఎబౌట్ ?" మరో సమిధ చేర్చాడు రాజేష్.

"అడవిలో వద్దనే, ఇంతకాలం బోర్డింగ్ హోమ్స్‌లో వుంచాను... సిటీస్‌లో తనకు నచ్చినవాడు తారసపడాలని ఫ్రీడమ్ ఇచ్చాను"... - కుండబద్దలు కొట్టినట్టు చెప్పాడు మల్హోత్రా

(ఇంకా వుంది

